# అడయిక్క-ప్పహిళ్ళె

ముద్దుకృష్ణ



ఉమా పబ్లిషర్సు
విజయవాడ.

★ డి. వెంకటస్వామికి ★

అంకితం

★

# పాత్రలు

అడయిక్కప్ప పిళ్ళై : భీమా ఇన్‌స్పెక్టర్

శ్రీవారు : జమీందారు

ముఖ్యప్రాణరావు : భీమా ఏజంటు

అంకమ్మ : శ్రీవారి నౌఖరు

నీలాచలం : తల్లి

ప్రభావతి : వేశ్య

ప్రఫుల్ల : చెల్లెలు

పాత్రలు, కథ కేవలం కల్పితం

# 1

పెద్దహాలు : ఇన్స్యూరెన్సు ఆఫీసు. ముందు భాగం ఎడమవైపుగా చిన్నబల్ల, దానిమీదను టైప్‌రైటర్, కాగితాలూ, రెండు ఫైళ్ళూ ఉంటవి. బల్లయెదరను కుర్చీ. మధ్యను ఒక ఆఫీసుబల్లా, దానిమీద ఫైళ్ళూ, కలాలూ, సిరాబుడ్లూ, ఇతర ఆఫీసుసామగ్రీ వుంటవి. బల్లచుట్టూ పేము కుర్చీలు ఉంటవి. వీటికి ఎడంగా కుడి యెడమ ద్వారాలకు పక్కను రెండు వైపులా రెండుబీరువాలు ఉంటవి. గోడలమీదను నాలుగువైపులా ఇన్స్యూరెన్సు కంపెనీల కేలండర్లు ఉంటవి. ఎదరగోడ మధ్యభాగంలో మద్రాసురాజధాని పటం వేలాడుతూవుంటుంది.

## ముఖ్యప్రాణరావు

పల్చని కాయశరీరం. వయస్సు 35. కణతలను బెండకాయముద్ర లుంటవి. నొసటను ఇందుబుగింజంత నల్లబొట్టూ, దానిలోనుంచి ఊర్ధ్వముఖంగా సన్నగిల్లిన నిడివిబొట్టూ ఉంటవి. మధ్యపాపిడి క్రాపు, గ్లాస్గో పంచె బిళ్ళగోచీపద్ధతిని కడతాడు. గ్లాస్గో జనీనుపైన డోరియాలున్న మల్లిన్ లాల్చీ. కాలికి కలకత్తాస్లిప్పర్లుఉంటవి. ఆత్రుతా, దూకుడూ కలిగి రావిఆకువలె చలించిపోయే స్వభావం.

## ప్రభావతి

వయస్సు 25. తగుమాత్రం కండపుష్టి వున్నప్పటికీ మనిషి స్థూలం కాదు. పొడుగైన వాలుజడ చివరను సీతాకోకచిలుక ఆకారంగావున్న వెడల్పు రిబ్బను కట్టివుంటుంది. నొసటను ముంగురులు కృత్రిమమేమో అనిపించుతవి. వెడల్పుజరీ అంచులున్న ఉప్పాడచీరా, పొట్టిచేతుల చివరను అదే అంచువున్న బ్లౌజూ, ఆమె దుస్తులు. కాళ్ళకు నాజూకయిన చెప్పు లుంటవి. చేతులకు సన్నని బంగారు గాజులు రెండుజతలుంటవి. మెడలో రెండుపేటల వాచీగొలుసూ, చెవులకు నిడివిపాటి లోలకులూ, నుదుటను చిన్న అగరుబొట్టూ ఉంటవి. చిన్న జేబురుమాలు ఎడమచేతి గాజులలోనుంచి వేలాడుతూవుంటుంది.

కూర్చున్నప్పుడు వాలుజడ వొయ్యారంగా వక్షస్థలంమీదకు వేస్తుంది. కదిలి నడిచినప్పుడు, ఆజడను అనవసరంగా పక్కలకు విసురుతుంది. మంచి కులుకు గలదీ, తళుకైనదీ అనిపించి ఆకర్షించడమేగాక, ఒక విధమయిన విచిత్రగతి స్వాభావికమా, కల్పితమా అనే అనుమానం మోజుగలవారికి విడనిసమస్య చేస్తుంది. మనిషి చాలా టక్కరి అనిపిస్తుంది; కాని ఆ టక్కరితనమే ఒక వింత ఆకర్షణగా లాగుతుంది.

## అడయిక్కప్ప పిళ్ళై

నీటితో నిండిన మేఘంవంటివాడు. వయస్సు 45. తెల్లపంట్లామూ, గళ్ళకోటూ, బహుశా భార్య కొత్తగా కాపురానికివొచ్చిన రోజులలో ఆమె అల్లిన "మెర్సిరైజ్డ్ కాటన్ నెక్‌టై", ఎర్రజోడూ, నల్లమేజోళ్ళూ, మలాకాబెత్తం చేతికర్రా, చెవులకు తెల్లరాళ్ళ అంటుజోడూ, కళ్ళకు రోల్డుగోల్డు ఫ్రేంఉన్న అద్దాలూ, సరాసరి వెనుకకు నొక్కి దువ్విన క్రాపూ; ఒక విచిత్రవ్యక్తిలా కనబడతాడు. నుదుటను పావలాకాసంత తెల్లబొట్టువుంటుంది. చిన్న ఫ్రెంచికటింగ్ మీసం.

కొంత తీపి తగిలితే ఆనందించి, కొంత కారానికి వొగర్చి, చెలతనంగా తేలిపోయే స్వభావం గలవాడే; కాని సమయమెరిగి మెప్పించి ఒప్పించి, వ్యవహారం చేయగల నిపుణుడూ, బాగారొమెరిగి బైఠాయించే నేర్పరి అనిపిస్తాడు.

### ప్రభావతి

[గది అంతటా స్వతంత్రంగా తిరుగుతూ ఖులాసాగా పాడుకుంటూ, మధ్యమధ్యను ఆత్రుతతో గుమ్మంవేపు చూస్తూవుంటుంది]

ఏటికే ఈ మగవారల
బూటకాలు నమ్మిచెదుట
ఏటికే ?......
ఆటలాగుకొందురు ఏ-
పాటి వనితనొరికిన, తమ
ఆట ముగిసినంతనె కొస-
గోట మీటి విసరుదురే ?
ఏటికే ఈ మగవారల
బూటకాలు నమ్మిచెదుట
ఏటికే ?

[పాట ముగిసేటప్పటికి మెట్లమీద చప్పుడు విని, అటు చూస్తుంది. అడయిక్కలప్ప పిళ్ళై, చేతికర్ర ఊద్చుకుంటూ ప్రవేశిస్తాడు. పిళ్ళైను చూసి తెల్లబోతుంది. పిళ్ళై ఆమెనుచూసి ఆశ్చర్యంతో నోరు తెరచి, మళ్ళీ సర్దుకుని మందహాసంతో]

### పిళ్ళై

సోక్కుండాడే, నిండా సోక్కుండాడే, సోక్కు, అడాడాడాడే!

[ముందుకు వొస్తాడు, ప్రభావతి నొసలు చిట్లించి, గిరుక్కుమని తిరిగి, రెండవ ద్వారంలోనుంచి సుర్రుమని పారిపోతుంది. పిళ్ళై దిగాలుపడి ఆగిపోతాడు. రావు ఆందోళనపడుతూ ప్రవేశిస్తాడు]

### పిళ్ళై

[చేతకర్ర లేపి, కసిరికొడుతూ] ఎన్నాయయ్యా; ఇది; ఇడ-ష్డి ఆఫీసు...ఇది ఎష్డి వేబారం ? ... వాట్సొల్లిస్ ? ...

ణోఁణోఁణోఁణోఁణోఁ, నాన్ రిబోర్ట్ సేస్తును... సేస్తును చూడు, పెరియరిబోర్ట్...[ముందుకువొచ్చి కుర్చీలో దర్జాగా కూర్చొని, ఆజ్ఞాపిస్తూ] ఎన్నాయ్యా ముక్కిప్పేసరావ్వా ... ఎన్నా వేబారం ఇది ? ఇన్‌స్యూరెన్స తలిస్తివా, శుమ్మా నాడగం తలిస్తివా ? ... ఇది డ్రామావా? ... సొల్లు...స్పీక్ మేణ్ !

రా వు

తొందరపడకండి పిళ్ళైగారూ; అన్నీ యేర్పాటులూ చేశాను.

పి ళ్ళై

[ఈసడిస్తూ] ఏర్పాటులు; యేర్పాటులు....ఎన్నా యేర్పాటులు?... టెణ్ మంత్స ... పత్తుమాసం అవ్వింటే... యేది వేబారం ?...

ఇనకు, యాబత్తు ఆయిరం; ఫిఫ్టీ థౌసంట్ వుండిందే... ఎఫ్డీ సేస్తువు?...

పెరియ ఆఫీసు పెడితి నంటివే...ఇదిదానా పెరియ ఆఫీసు... నా మూతి ఆఫీసు...

కంబెణీకి ళాస్, ళాస్, ళాస్, [లేచి, చేయిఝాడిస్తూ] ఎల్లాం ళాస్‌దా !

రా వు

ప్లీజ్ వైట్ సార్ ... కొంచం తాళండి పిళ్ళైగారూ. [అటు తిరిగి] ప్రభావతీ ! ప్రభావతీ !!

ప్ర భా వ తి

[లోపలనుంచి] ఆ !

పి ళ్ళై

[కేక విని, కుర్చీలో కూర్చుంటూ, మందహాసంతో] ముక్కిప్పే నరావ్రూ, యారదీ? ఆ!

రా వు

["ఉండండి" అన్నట్టు కనుసౌంజ్ఞచేసి, గుమ్మంవేపు వెళతాడు. పిళ్ళై హుషార్‌గా కఱ్ఱ త్రూపుతుంటాడు. రావు ప్రభావతి రాకచూసి ఇటు తిరుగుతాడు. ప్రభావతి గుమ్మంవద్ద నిలబడిపోతుంది. రావు తిరిగి చూసి, రమ్మని సౌంజ్ఞచేస్తాడు. ప్రభావతివొస్తుంది; పిళ్ళై కూర్చుంటాడు]

రా వు

ప్రభావతీ, వీరే, మన కంపెనీ ఇన్‌స్పెక్టర్ అడయిక్కప్ప పిళ్ళైగారు...

ప్ర భా వ తి

నమస్కారం.

పి ళ్ళై

మ్చ్‌మ్చ్‌మ్చ్ [అంటూ నోరు చప్పరించి] శరిశరిశరి, ఉక్కారు ఉక్కారు...కూసుండేద్దానే!

రా వు

[ప్రభావతిని చూపిస్తూ] ప్రభావతి ఈవూరికంతకీ ప్రఖ్యాతి పొందిన వేశ్యాకుటుంబంలోనిది. మన కంపెనీ అంటే చాలా అభిమానం. వీరి కుటుంబంవల్ల వీళ్ళ కులంలోనేకాక, వాళ్ళ తాలూకువారందరిచేతా బోలెడు వ్యాపారం మనకి జరుగుతుంది...

పిళ్ళై

వో, వో, వో, జరుగుచు. జరుగుచు ... జరిగిదా తీరుచు ... [ప్రభావతితో] ముక్కేప్పేనరావు నిండా వేబారం మనిసి, రొంబా తెలివి మనిసి, నల్లా స్నేహిదం మనిసి !

ప్రభావతి

వేపారిపంతుళ్ళకీ వేశ్యలకీ వ్యాపారాలలో పోలికలు హెచ్చు; పనులు వేరైనా పద్ధతులు మావి ఒక్కటే !

రావు

ఏం నోటిచొరవ ? సమయం బేసమయం లేదూ; మంచీ మర్యాదా లేదూ...

పిళ్ళై

అడెడెడెడే, ఎన్నా సార్ అట్లా కోబం సేస్తువు? వాళ్ళుదా గేలి చేసేదానికి వుంటురు; మనందా నవ్వేదానికి వుంటుము!... ఎంతకు అమకళం సేస్తువబ్బా ...

[ప్రభావతితో] సూడూ, పెరబావదీ! మనకి కోబంలేదు... సూస్తువా, మనకి ... గేలిసేసి సూస్తువా?

ప్రభావతి

మాకు అలాంటివి చేతకాదండీ... అటువంటివాళ్ళు ఆ వీధిని వేరేవున్నారు... గేలి ఏమిటండీ పంతులుగారూ ?

రావు

అదీ, మెడ్రాస్ తెనుగు... గేలి అంటే తప్పుమాట ఏమీ కాదు, వేళాకోళం అన్నమాట.

### పి ళ్ళై

[బిగ్గరగా నవ్వుతూ] అడాడాడాడే, పెరబావదీ, గేలి నాక వేరుగా తలిస్తివా? శుమ్మా, దమాష్‌దా!

### ప్ర భా వ తి

[నవ్వుతూ] పిళ్ళైగారూ, నవ్వు ఆగడంలేదు; మిమ్మల్ని చూసి అనుకోకండి...అలవాటులేక మీభాష దమాష్‌గా అనిపిస్తూవుంది.

### పి ళ్ళై

మ్చ్‌మ్చ్‌మ్చ్...అదుప బయంతే...ఆండవాళ్ళు నవ్వాల్సిందిదా [ముఖ్యా! ప్రాణరావుతో] నవ్వు నిండా ఆరోక్యమే!

### రా వు

[ప్రభావతితో] నీగోల కేంగాని, లోపలికిపోయి టిఫినూ కాఫీ పట్టుకురా.

### ప్ర భా వ తి

[పిళ్ళై పక్కనుంచి పోబోతుంది]

### పి ళ్ళై

ఇప్పొవేండా కాఫీ...ఇప్పొదానే స్టేషన్‌లో బోంచేస్తిమి, కాఫీ! [కొంగుపట్టి ఆమెను ఆపుతూ] పెరబావదీ, పెరబావదీ, నిల్చేద్దానే, నిల్చేద్దానే!

### ప్ర భా వ తి

[ఒక ఓరచూపు కటాక్షించి, వాయ్యారంగా పైట లాక్కుంటూ ళ్ళై చేతికి చేయి తగిలించి, తప్పుకుంటూ వెళ్ళిపోతుంది]

పిళ్ళై

[వొళ్ళు ఝల్లుమని, స్వప్నసుఖం అనుభవిస్తూ] డాడాడాడాడా, ముక్కోప్పేనరావ్రూ, ముక్కోప్పేనరావ్రూ, మనకి వాడంబు తెలి సేది లేదబ్బా...నిండా సవిక్కోం సేస్తివి—సాలబ్బా, సాలు! నైస్సా యేర్పాటు సేస్తివి...వో!

[గొంతుక తగ్గించి] పెరియ బ్యూటిఫుళ్ మనిసి పెర బావది... నిండా బ్యూటిఫుళ్!

మనకి ఇప్పుడుదా తెల్సింది...నీవు సేస్తువబ్బా నీట్టా వేబారం సేస్తువు...బయంలే...బయంలే. [లేస్తాడు]

రావు

మీ దయవుండాలి సార్; నాకు కొన్ని చిక్కులు వొచ్చికాని, లేకుంటే ఈపాటికి రెండు లక్షలైనా వ్యాపారం చేసివుండును. కాస్సేపటిలో వొస్తారు జమీందారుగారు...

పిళ్ళై

[లేచి, ప్రభావతి వెళ్ళిన ద్వారంవైపు చూస్తూ] వో, సమీం తారా? ... సమీంతారు వొస్తురా ?

రావు

ఔను సార్; అటువంటివారిని ఇద్దరిని పట్టుకుంటే చాలును, చిల్లర పోలసీలు ఎన్ని ఏంలాభం ?

పిళ్ళై

ఆమా, ఆమా, ఆమా! అదిదా ఫస్టు, అట్లదాచేసేది...

నేను రాస్తుచులే, కంపెనీకి నైస్సా రిపోర్టు రాస్తును! ముక్కోప్పేనరావ్రూ, ముక్కోప్పేనరావ్రూ! [వీపు తడుతూ] బయ పడాదే! బయపడాదే!! బయపడాదే!!!

రా వు

[ముఖం వికసిస్తూ] చూడండి సార్. ఆఫీసు ఎలాయేర్పాటు చేశానో...నాకు కంపెనీవారు ఇప్పటికి యిచ్చిన కమీషనంతా అదిగో ఆ ప్రభావతికోసమూ, ఈ ఆఫీసుకోసమూ, ఇంటిఅద్దె కోసమూ ఖర్చయిపోయింది. ఇందాక మీరు...

పి ళ్ళై

మనసు కష్టం సేసుకోకబ్బా...మనకి కొంజం ముందు కోబం, అంతదా... అపరం...[ఆద్వారంవేపు వెళ్ళి, అటు చూస్తూ నిలబడిపోతాడు]

రా వు

చూడండి. ఈ కుర్చీలూ... బల్లలూ...

పి ళ్ళై

[చూడకుండానే] వో, నైస్సా యిరుకు, నైస్సా యిరుకు రొంబా నైస్సా యిరుకు...

రా వు

చూడండి. ఎంత సౌందర్యంగా యేర్పాటుచేశానో...

పి ళ్ళై

[ప్రభావతి వెళ్ళినవేపే చూస్తూ] సూస్తినే, సూస్తినే, ముందు అద్దా, సవుందెర్యముదా సూస్తిని...ముక్కెప్పెనరావూ పెరబావది సవుందెర్యం...

రా వు

అదికాదు సార్, తాము రాగానే కోపంతో నిష్కారణంగా చీవాట్లు ఆరంభించారు... [పిళ్ళై కుదరకుండా శుమ్మానికి అడ్డం నిలుస్తూవుంటే]

పి ళ్ళై

[అతనిని అడ్డంలేకుండా పక్కకు లాగివేస్తూ] అదీ, శుమ్మాదా...అడెడే, మీకు ఆన్‌దిరులకు ఇదిదా బెద్దలోబం. ఎల్లాం ప్రసికా సూస్తురు.

బయపడాదే ముక్కిప్పేనరావ్వూ, నాన్ నల్లారిబోర్టు రాస్తును. సూడిమీ, పెరిబావది పూడిసిందేకి

రా వు

వొస్తుంది. కూర్చోండిసారే, ప్లీజ్ సిట్‌డౌన్, [అటుతిరిగి] ప్రభావతీ! ప్రభావతీ!!

ప్ర భా వ తి

[లోపలనుంచి] ఆ! వొస్తున్నా!

పి ళ్ళై

[సర్దుకుని వొచ్చి, కుర్చీలో కూర్చుని, ముఖం వికసిస్తూ] నల్లా గాత్రంసార్! నుంగళ్ ఆన్‌దిరబాష నల్లా మ్యూజికల్ లేంగ్వేజ్.

ప్ర భా వ తి

[టిఫెనూ, కాఫీ ప్లాసూ, కప్పులూ ఉన్న "ట్రే" పట్టుకొని ప్రవేశిస్తుంది]

పి ళ్ళై

[కళ్ళు అప్పజెప్పి చూస్తూ] అడాడాడాడే ఇది ఎడ్డి సార్ ? వాట్సదిస్? సర్వెంటిల్లియా?

రా వు

[“(క్రో” అందుకుని బల్లమీదపెడుతూ] నౌఖరు ఉన్నాడు సార్! కాని,వాడువుంటే మనకుస్వేచ్ఛవుండదని పొమ్మన్నాను.

పి ళ్ళై

[ప్రభావతితో] ముక్కిప్పేనరావు పెరియాయోజనమనిసి! [ముఖ్యప్రాణరావుతో] వేండా సార్ ! సర్వెంటు వేండా [ చిన్న గొంతుకతో ] ఇప్పొ వేండా సర్వెంట్.

ప్ర భా వ తి

[కష్టాలు పడుతూ ] పిళ్ళైగారూ, క్షమించాలి, మీపేరు నోరు తిరగడంలేదు.

పి ళ్ళై

[గొప్పగా] మన పేరుదానే! అడయికప్పపిళ్ళై, ఆమ!

ప్ర భా వ తి

అడ... అడ... అడకప్ప...

పి ళ్ళై

అడ్డీయిల్లే, అడ్డీయిల్లై. [విడదీసి పలుకుతూ] అ డ యి... కప్ప... పిళ్ళై.

ప్రభావతి

పోనీలెండి. పిళ్ళైగారూ అంటే చాలదూ?

పిళ్ళై

వో, అంతదా సాలు, వో, సాలు, సాలు... సాలు!

రావు

పిళ్ళైగారూ, కొంచెం చేతులూ ముఖమూ కడుక్కుంటారా?

పిళ్ళై

[చేతులు చూసుకుంటూ] కయ్యి నల్లదా యిరుకు...

ప్రభావతి

[పిళ్ళై చేతులు పట్టి చూస్తూ నవ్వుతూ] ఔనండీ, నిజంగా అలాగేవున్నాయి..... [ముఖంమీద మొఖంపెట్టి చూస్తూ] ముఖం కూడా పాపం నల్లాదా...

పిళ్ళై

[ఆనందంతో] శరి శరి శరి, పెరబావది ఇష్టందా...మన యిష్టం! [ప్రభావతితో] మూంజి...ఫేస్ కళిగివొచ్చేడా? [రావుతో] సొప్పిరుక?

రావు

సబ్బువుంది రాండి; ఇలా దయచేయండి. [లోపలికి దారి చూపుతాడు]

పి ళ్ళై

[వెంట వెళ్తూ గుమ్మందగ్గర ఆగి, ఇటు తిరిగి] పెరబావదీ, పెరబావదీ, నాన్ ఇప్పొదావొఱ్రెం... బిన్నెదా వొస్తును...

ప్ర భా వ తి

మంచిది వెళ్ళిరాండి. [పోనిచ్చి వెక్కిరించి, నవ్వఆపుకొని]

మేత కరిపిల్ల, పోరున మేకపిల్ల
పారుబోతుతనంబున పందిపిల్ల
ఎల్ల పనులను చెరుపంగ పిల్లిపిల్ల
అందమున కోతిపిల్ల యీ అరవపిళ్ళ !

[విరగబడి నవ్వుతూవుంటుంది]

రా వు

[కోపకోపలాడుతూ వొచ్చి] ఏడు పుటాలుపెట్టినా, ఎంత మర్యాదస్తులతో సహవాసంచేసినా, మీ కులంబుద్ధి మీకు పోదు...

నా ఉద్యోగం ఊడగొట్టుకోడానికి నిన్ను పిలిపించా ననుకున్నావా? నాకొంప ముంచుకోడానికి నిన్ను కోరి తెచ్చు కున్నా ననుకున్నావా?...

ప్ర భా వ తి

[నిరసనగా] ఏమండీ, ఊరికే చిందులు తొక్కుతారు; ని...వ్వా...లు...తొ...క్కా...న

రా వు

ఆసిభడవా, అనేయ్! ఆకాస్తా నన్ను కూడా అనేయ్! నిప్పులు తొక్కిన కోతిలా అని... వాణ్ణి అన్నావుగా పందిపిల్ల-పిల్లిపిల్ల - కోతిపిల్ల - అని... ఆపద్యంగా వాడు విని, నాఉద్యోగంకాస్తా ఊడిపోతే నీకేం?

ప్ర భా వ తి

ప్రతీదీ గాభరా చేస్తారెందుకండీ; ఆయన ఎక్కడో లోపల వున్నారుకదా అని, సమయానికి సరిగ్గా జ్ఞాపకంవొచ్చి చిన్న గొంతుకతో, సరదాకి, శ్రీనాధుడంతటి కవి అన్నాడు కదా అని, ఆపద్యం చదివితే . . .

[దిక్కుతూ] ఈమాత్రానికే ఉద్యోగం ఊడిపోతుంది; ఊరు తగలబడిపోతుంది అని గోలపెడతారేం?

రా వు

[కోపంగా] మీకేం, మీకన్నీ సరసాలూ సల్లాపాలున్నూ! చేతిలో పైసాలేక నేను చస్తూవుంటే, జాలైనా లేకపోయింది మీయమ్మకి. ఇస్తానన్న మూడువందలూ ఈయలేకపోయానని మూడునెలలనుంచి నా యెముకలు కొరికి వేస్తూవుంది. ఆఖరికి నిర్మొహమాటంగా మీచెల్లి చేత చెప్పించిందిగదా, డబ్బు తీసుకరాందే గుమ్మం తొక్కవొద్దని...

ప్ర భా వ తి

ఆముసలిది అలా అన్నదని ఇంతసాగతీస్తున్నారే, మరి మాకు మాత్రం గడవడం యెలా చెప్పండి? నెలకి నూరు రూపాయీలు లేందే మాసంసారం గడవదుకదా... నేనా,

మీాకు ఇలా కట్టుబడి వుండిపోయాను! ఆనాయుడుగారు తప్పు కున్న నాటినుంచీ మాచెల్లెలికి మరొక పోషణ కుదరనేలేదు; ఆముసలిది యెలా ఛస్తుంది చెప్పండి?

రా వు

మీాయమ్మ అనుకుంటే నీవూయెత్తావూ సంసారం గోల?

ప్ర భా వ తి

[ముఖం చిట్లించి] ఊరుకుందురూ, నాకు వొళ్ళు మండు తుంది. మాఅమ్మ డబ్బడగడంసంగతి మీారెత్తారా, నేనె త్తానా, ఎందుకొచ్చిన మాటలు?

రా వు

పోనీలే, నాదే పొరబాటు...సరా![బ్రతిమాలుతూ]మరి, ఈ ఒక్కరోజు నా మర్యాద దక్కించు.

ఈ అరవవాళ్ళు అసలే దభాయింపు మనుష్యులు; నేను వ్యాపారంలతూ పూర్తి చేయలేదని, వొచ్చీరావడంతోనే వాడు తిట్టకుండా; లోపల కాలుపెట్టేటప్పటికి నీవు తళుకుగా యెదర పడితే మంచిదని... నేను జట్కావాడితో లేనిపేచీ పెట్టుకుని కాస్త ఆగిపోయాను...

[కఠినంగా] కాని, వాడు కాలు లోపలపెట్టాడో లేదో అప్పిడే ఆరంభమూ, నీభాగవతం?

ప్ర భా వ తి

[సాగదీస్తూ] నాదా భాగవతం?... [కసకసా నవ్వుతూ]

మీ భీమాభాగవతం ఇలా వరహావతారంతో ప్రారంభమౌతుందని నాకేం తెలుసు.

రా వు

ఛా, నోరుకట్టు! వేళాపాళా లేదు; ఎప్పుడూ ఒక్కటే వేళాకోళం...

ప్ర భా వ తి

[ముఖం చిట్లించి] ఎందుకండీ ఊరికే ముఖం చెండ్రుకుంటారు? నేం చేసిన తప్పేమిటి?

రా వు

మీకు తప్పులనేవి ఉంటేగా ఒప్పులేవో తెలియడానికి... మీ జాతి లక్షణాలు మీకు సహజమైపోయాయి... వొచ్చే రావడంతోనే మనిషిని ఆకర్షించి,కవ్వించడానికి, వాడూరాగానే తుర్రుమని గదిలో దూరిపోయావు... పాడు వేశ్యా వేషాలు.

ప్ర భా వ తి

[సాగదీస్తూ] ఆ ! మావి పాడు వేశ్యా వేషాలైతే మీవి విపరీత వేపారివ్యాఖ్యానాలు కావుకాబోసు! ప్రతీ దాన్నీ, ప్రతీ మనిషినీ, అనుమానంతో చూడడం, చచ్చినా ఏదీ నమ్మకపోవడం... [బుగ్గలు పొడుస్తూ] మీకులంబుద్ధి కాదేం ?

రా వు

ఆ ! ఏంపోగరు?

ప్ర భా వ తి

[మెత్తగా] అబ్బ,ఉండండి...చెప్పనీయండి [తీర్థాలంతీస్తూ] ఎవరో భీమాఇన్‌స్పెక్టరు... పందల జీతగాడు... మద్రాసు

నుంచి మెయిల్లో దిగుతున్నాడంటే ఎలాగుంటాడో అని నేను యెదురు చూస్తుంటే, [విపరీతంగా నవ్వుతూ] హఠాత్తుగా యెలుగుబంటో...ఏదుపందో... అన్నట్లు ఎదురైతే... భయం వెయ్యదూ మరి...[పిరగబడి నవ్వుతూవుంటుంది]

రా వు

[నోటిమీద చేయివేసి] ఏమిటి, ఆ ఆ ! నవ్వేమిటి ? అరే, నీదుంపతెగా ... నువ్వు యేధోరణిలోపడితే ఆధోరణే... ఇవాళ నాకొంపముంచేటట్టున్నావు...ఇంటికి వెళ్ళాక నీ నవ్వులాటలు సాగించుదువుగాని, వాడుగనా వింటే...

ప్ర భా వ తి

ఒక్క మెతుకుపట్టి అన్నంసంగతి చెప్పుకునే జాతిగదా మాది ; ఆయన సంగతి ఆ మాత్రం గ్రహించలేకపోయానా ? అప్పిడే రారులెండి. ఆ సబ్బాబసబ్బాబ మొహాన్ని రుద్దీరుద్దీ, అరగదీసేస్తుంటారు; ఆ నలుపుమొహానికి ఇప్పుడు తళుకు కావాలిగదా ?

రా వు

చివరకి చూస్తే, నా వ్యాపారం చచ్చి, ఇది నీ వ్యాపారంలోనికి దిగేటట్టుంది ... తీరా ఆ జమీందారు నొక్కణ్ణి రమ్మన్నాను. ఈ క్షణమో మరోక్షణమో ఆయనకూడా దిగుతాడు.

ప్ర భా వ తి

[ ఆలోచనతో ] అయితే?

రా వు

అయితేనా, ఏముంది? నిరంతరం కోడిమాంసాల వేడి మీాద నుండే జాతి ఆ జమిందారులది; నీమాత్రం తళుకూ కులు కూవున్న ఆడది మెదరపడితే ఇకేముంది? దానికితోడు నీవూ కన్నుకలిపి కథలోనికి దింపావా; నా భీమావ్యాపారం దిగజారి, నీ భీమాకలాపంలోకి దిగుతుంది.

ప్ర భా వ తి

పాడు అనుమానాలూ మీారూ, నాకెందుకూ యీా వెధవ వ్యాపారం ? [దోష్పుతూ] మీా భీమావిలాపమూ వొద్దు, నా భామకలాపమూవొద్దు.మీాబాధేదో మీారే పడండి. నాకెం దుకూ లేనిపోని రొస్టు... నాదే బుద్ధితక్కువ [సర్రుమని లేచి వెళ్ళిపోబోతుంది]

రా వు

[గాభరాపడుతూ ఆమెను వెంబడిస్తూ] అరే, ప్రభావతీ, ప్రభావతీ, ఆగాగు! నీకు పుణ్యముంటుంది, నా మర్యాద దక్కించు, కొంచెం జాగ్రత్తగా ప్రవర్తించమూ, నా గౌరవం కాపాడమూ, అన్నాను కాని, మరేమన్నా అన్నానా ?

ప్ర భా వ తి

[చిరాకుపడుతూ] నేనుమాత్రం ఏంచేశానూ ? చీటికీ మాటికీ 'జాతిబుద్ధి జాతిబుద్ధి' అని సూదిపోటుమాటలూ మీారున్న ...ఎవరి జాతిబుద్ధులు యెవరికి వొదిలాయిలెండి, మా జాతిబుద్ధి మాకు పోవడానికి...మా అమ్మ పోవద్దంటూన్నా,

పోనీ, అంతగా బ్రతిమాలుతూ ఉత్తరం రాశారుకదా అని, మా యమ్మతో పోట్లాడిమరీ వొచ్చినందుకు తగిన శాస్తి చేస్తున్నారు...[ఏడుపు నటిస్తూ, కళ్ళు అద్దుకుంటుంది]

రా వు

[భుజంమీద చేయి వేసి బుజ్జగిస్తూ] నీ బొడ్డు బంగారంగానూ, నేనేం నోరెత్తను, వొచ్చి నామాట దక్కించు, సరా!

కళ్ళెదురుగా నీలాంటిదికనబడుతూంటే, ఆ జమీందారు నీకు కళ్ళప్పజెప్పి, కాగితాలమీద సంతకాలు పెడతాడు; ఆ ప్రీమియం కాస్తా కట్టేస్తే, నా మొత్తం కమీషన్ నాలుగు వందలో అయిదువందలో మినహాయించుకుని, మీ యమ్మకు ఆ మూడువందలూ పారేసి, మిగతాదాంతో నీకూ మీచెల్లెకీ పది, పది చీరలు కొని పడేద్దామని ఆశిస్తున్నాను.

ప్ర భా వ తి

[చనువుగా దగ్గరకు వెళ్ళి, చొక్కాబొత్తాం లాలనగా తిప్పుతూ] అయితే సరేకాని, మరీ...ఈ పిళ్ళైగారితో నేను వేశ్యనని చెప్పారుగదా – ఆ జమీందారుతో... మరోవిధంగా మార్చి, చెప్పు...

రా వు

ఒహోహో, నాకు నాటకమాడడం నేర్పేటట్టున్నావ్, ఆ వెర్రి పిళ్ళైతో ఏంచేస్తే ఏం తగాదా? అసలు నాటకం ఆ జమీందారుతో అంటూంటే! అవసరానికి అడ్డుపేచీ వేశ్యకి లేని దద్దమ్మనికాను! [మీసంమీద చెయివేసి] ఆ మాత్రం మెదడు ఏడిసింది మనకి! కాని, నీవుమాత్రం దయవుంచి నా నాటకంలో నీ అంతర్నాటకాన్నిమాత్రం అల్లకు!

ప్రభావతి

[తీవ్రంగా] ఇదిగో, ఇదే మీకున్న బుద్ధి... నాకెందుకూ ఈ పాడుగోల; మీ అనుమానాలతో నేను చావలేను . . . తేగలుగు తేడబ్బు తెండి; లేకపోతేపోనీండి... మీకు ఒక సలాం. నేను ఈపనులు చేయలేను . . . నాకు అసలే భయం ఈ జమీందారులంటే . . .

రావు

ఆరే, ఎందుకూ భయం ? నీకేం మతివుందా లేదా; ఆయన నిన్ను పలకరిస్తారా, ఆయన్ని నీవు పలకరిస్తావా?

ప్రభావతి

[భుజంమీద చేయివేసి, లాలనగాతులుకుతూ] మరీ... ఆ ఆఫీసు సంగతులూ... అవేవో ఆసైపు సంగతులూ, ఆజమీం దారుగారుగనా అడిగితే, నేనేంచెప్పను, నాకేంతెలుసు నని...

రావు

ఓసి వెర్రిమాలోకమా, ఇదా నీభయం! నీకేం ఫరవా లేదు; నేను పక్కనే వుంటానుగా! చూడూ, నీవు బొమ్మలా కూర్చో... కదలకు... ఆ జమీందారు పలకరించినా పల కకు, సరా!

ప్రభావతి

పంతులుగారూ, మీకు నమస్కారం. నన్ను పోనీ యండి; ఎవర్నైనా నాటకాలకి పనికివొచ్చే మనిషిని పట్టుకోండి; నన్నుమాత్రం చంపకండి.

రా వు

ఓసి పిచ్చిదానా, ఈ ప్రపంచకమే ఒకనాటకం. అందులోనూ నీ జీవితానికీ నాజీవితానికీ అడుగడుగునా, మడత పేచీలూ మజాకాలూ వుంటేనేగాని, మనబ్రతుకుదెరువులు మార్గానికిరావు! ఇంత తెలివైన దానివీ, ఈ మాత్రానికే ఇలా హడిలిపోతున్నావేం?

ప్ర భా వ తి

నాకెందుకండీ ఈగోల ... ఈజమీందారులంటే నాకెందుకో భయం! పైగా, మీతో, కూర్చుంటే మరామేకు, నిలుచుంటే మరామేకు! మీ అనుమానాలతో నేను బాధపడలేను; నన్ను చంపినాసరే నేనుండను! నేపోతాను [వెళ్ళబోతుంది]

రా వు

[ఆత్రుతగా చేయి పట్టి ఆపి] ప్రభావతీ, ప్రభావతీ, ఈ ఒక్కపూటా నామాటదక్కించు... నీమీద ఆధారపడి నిబ్బరపడిచాను. ఇంతవరకూ నిక్షేపంలా దారికివొచ్చిన వ్యవహారాన్ని నిష్కారణంగా కాలితో తన్ని వేయకు. నామాట విను; ఇదిగో ఇవి చేతులుకావు... [చేతులు దీనంగా పట్టుకుంటాడు]

ప్ర భా వ తి

[నవ్వు ఆపుకుంటూ] మా బాగుంది. ఇవీ, చేతులుకాకపోతే మరేమిటి?

రా వు

నన్ను దద్దమ్మను చేసి నానోటిని అనరానివికూడా అనిపించాలి కదూ... సరే, కానియ్యి... చేతులుకావు ...కాళ్ళు.

ప్ర భా వ తి

మరీబాగుంది!... కాని, మీకోసం నేను నాలుగు కాళ్ళ జంతువుని కాలేను...

రా వు

ఛీ, కట్టిపెట్టు వెధవ వేళాకోళం... [బిగ్గరగా] నేను చచ్చి సున్నమై నానాగడ్డీ కరుస్తూంటే; ఎలకకి ప్రాణపోకటా పిల్లికి చెలగాటా ...[వెనుకకు తిరిగేటప్పటికి]

పి ళ్ళై

[ప్రవేశిస్తు] ముక్కప్పేనరావ్వా, ముక్కప్పేన రావ్వా, ఇయ్యొయ్యొయ్యొయ్యో, ఎన్నాయ్యా శుమ్మా అమకళంసేస్తువు. ఎన్నా పెరబావదీ కూసుండేత్తానే...

రా వు

[గతుక్కుమని సద్దుకుని] ఆ... ఏమీలేదు సార్, వాళ్ళ యింటిసంగతులు చెప్పి బాధ పడుతూంది. అంతే... చూడు ప్రభావతీ, పిళ్ళైగారికి యిడ్లీ సాంబారూ...

పి ళ్ళై

వేండా, వేండామప్పా. టిఫిను వేండా శుమ్మా కాఫిదా బోంచేస్తును.

ప్ర భా వ తి

[మందహాసంతో] పిళ్ళైగారూ, మీరు పెద్దకప్పు బోం చేస్తారా, చిన్నకప్పు బోంచేస్తారా?

పి ళ్ళై

ఎనకు కాఫి జాస్తిదా వుండాలి: పోస్సేద్దానే... సూడు పెరబావదీ మద్రాస్ సూస్తివా?

ప్ర భా వ తి

[కళ్ళతో లాలిస్తూ] లేదండీ, ఎన్నాళ్ళనుంచో చూడవలెననుంది...

పి ళ్ళై

[హుషార్‌గా] పూడుస్తుమా మద్రాస్?

ప్ర భా వ తి

[నవ్వు ఆపుకొంటూ] అమ్మయ్యో అంత పెద్ద పట్నం పూడ్చడం ఎలాగండి, నాచేతకాదు.

పి ళ్ళై

అందుకు బయంలే, నాన్‌దా సెగండ్ గ్లాస్‌లో తోడుకుపోతును.

ప్ర భా వ తి

[నవ్వుతూ] అదేమిటండీ ఓఘాయిత్యం మాటలు, వృధాగా మీరు తోడుకుపోవడం పాపం...

పి ళ్ళై

[ముఖ్యప్రాణరావుని చూస్తూ] ఎన్నా అదీ?

రా వు

ఏమిటే వెధవవాగుడు? తోడుకుపోవడం అంటే వాళ్ళ భాషలో వెంట తీసుకువెళ్ళడం అన్నమాట.

ప్రభావతి

[శిర్షాలుతీస్తు] అలాగేనండీ పిళ్లైగారూ, తప్పకుండామీరు తోడుకుపోండి; నాకేమీ అభ్యంతరంలేదు...మద్రాస్‌మాత్రం నేను తప్పకుండా వొస్తాను... [వంకరమూపుచూస్తూ, పిళ్ళైను గమ్మత్తుగా చేయితగిలిస్తూ] పిళ్ళైగారూ, మీరు చాలామంచివారండీ!

పిళ్లై

[వొళ్ళు జల్లుమని ఆనందిస్తూ] శరి, శరి, శరి, పెరబావదీ (చిన్నపిల్లలు తీపిసరుకు నోట్లో వున్నప్పుడు ఝ్లూఊ...అని పీల్చినట్టు నోరు చప్పుడు చేస్తాడు)

రావు

చూడు ప్రభావతీ. కాఫీ నేను పోస్తానుకాని, నీవు ఏదైనా మంచి జావళీవో, పదమో పాడు...లేదా, పిళ్లైగారి మీద అభినయం పట్టినానరే !

[చిరాకుగా] ఏదీకానివేళ ఇప్పుడేమిటండీ అభినయం ?
(దూరంగా వెళుతుంది)

పిళ్ళై

[ఉబలాటపడుతూ ఆనందంతో] వో, వో, వో, అపినయందా పట్టేది, అపినయందా ... కావాలబ్బా ఎనకు అపినయం కావాలి...వో...[ప్రభావతి వేపు తిరిగి]సూడూ, పెరబావదీ, రమ్మా, ఇష్టీ, ఇష్టీ రమ్మా...

ప్రభావతి

(దగ్గరగా వెళుతుంది)

పి ళ్ళై

(తలవంకరగా పెట్టి, కళ్లు యెగరవేస్తూ [illegible] ముందరపోస్తూ) పెరబావదీ, సేస్తువా ... సేస్తువా ... ఎన్నా [illegible], [బిగ్గరగా] మన కపినయం, ఆ?

ప్రభావతి

[నవ్వుతూ] మీా కపినయం కావాలా?

పి ళ్ళై

[తిరిగి నవ్వుతూ] వో, కావాల్సిందిదా, వో ...

రా వు

[ఫ్లాస్కులోనుంచి కాఫీ పోసి, పిళ్ళైకు కప్పు అందిస్తాడు]

ప్ర భా వ తి

మీారు కాఫీ భోంచేయండి; ఇంతలో నేను, ఆకులూ వక్కలూ తెస్తాను... తాంబూలం వేసేప్పుడుకదా అభినయం షోకు [తిప్పుకుంటూ వెళ్ళిపోతుంది]

పి ళ్ళై

[కాఫీ తాగకుండా, ఆమెవైపు మైమరచిచూస్తు] ముక్కప్పేన రావూ, ముక్కప్పేనరావూ, పెరబావది నిండా సోక్కుమని సవ్వా, నిండా సోక్కుమనిసి, ఆమ! [కాఫీ ఒకగుక్కను తాగి, "శేవ్" అని తేనుస్తూ, పొజ్జ తడుముకుంటుంటాడు]

రా వు

కంపెనీకోసం నేనెంత శ్రమపడ్డానో [illegible] చూస్తున్నారుకదా, నాయందు దయవుంచి [illegible] సిఫార్సు

చేయాలి సార్! కొంతకాకపోతే కొంతైనా ఈ ఆఫీసుఖర్చు కంపెనీవారు భరించకపోతే నాకు కష్టంసార్!

పి ళ్ళై

రాస్తును, రాస్తును, నేడుదా రాస్తును... సూడూ, పెరబావదీ... [లేచి పచారుచేస్తూ మాటిమాటికి ప్రభావతివైపు చూస్తూ వుంటాడు]

రా వు

వొస్తుంది సార్; వొస్తుంది. ఇంకొక్క సహాయంకూడా మీరు చేయాలి సార్. ఈ ఆరునెలలోనూ లక్షా పూర్తిచేస్తాను కాని, ఈలోపుగానే నాకు పూర్తి కమిషన్ వొచ్చేటట్టు చేయాలి మీరు అనుగ్రహించి...

పి ళ్లై

హో, సేస్తును, సేస్తునబ్బా, సేస్తును, బయంలే... పెరబావది నల్లా మనిసప్పా!

రా వు

ప్రభావతి చాలా సర్దాఅయినదేకాని కొంచెం కోపం యెక్కువసార్.

పి ళ్లై

మ్చ్, మ్చ్, మ్చ్; నీకుఏమీ తెలిసేదిలేదబ్బా. అది ఆండవాళ్ళ లచ్చనం అబ్బా!

ప్ర భా వ తి

[ఆకలూ వక్కలూ వున్న పళ్ళెంపట్టుకొని, కూనిరాగంతీస్తూ ప్రవేశించి] పిళ్ళైగారూ, కాఫీ బోంచేస్తిరా?

పి ళ్లై

పెరబావదీ, ఇస్తువా వక్కాకు?

ప్రభావతి

ఒకాకు కర్మమేమండీ, పదాకులు వేసుకోక?

పి ళ్లై

[ముఖ్యప్రాణరావుతో] ఎన్నా అదీ?

రావు

మీ మెడ్రాసువాళ్ళు వక్కాకు అంటారు, మేం వక్కలు ఆకులు అంటాం.

పి ళ్లై

వో, అదివా! వొక్కులూ! ఆంకులూ!

ప్రభావతి

పిళ్ళైగారూ, క్షమించాలి [పళ్ళెం అందిస్తూ] నాకు మీ భాష బాగా తెలియడంలేదు.

పి ళ్లై

ఆమ, ఆమ, ఆమ! మనకి అన్దిరబాస ఇనేదానికి వో, సరియా తెలుసు; చెప్పేదానికిదా కొంజం కొంజం తెలుసు... అదుకు ఏమిలే? [వక్కలు ఆకులు నములుతూ] పెరబావదీ, పెరబావదీ, సేస్తువా, ఎన్నా చేస్తువా, అపినయం సేస్తువా?

ప్రభావతి

ఆఫీసులో అభినయం ఏమిటండీ... సాయంత్రం మాయింటికి దయచేయండి!

రా వు

ఇదిగో, మీకిదే తెగులు. ఆయన సరదాపడుతున్నారు గదా, ఊరికే కాస్త ఏదైనా పదం పట్టరాదూ?

పి ళ్ళై

ఆమా, ఆమా, ఆమా, శుమ్మా కొంజం శాంపుల్ దా, శాంపుల్!

ప్ర భా వ తి

సరే లెండి, లేకుంటే మా పంతులుగారికి మళ్ళీ కోపం వొస్తుంది. రాండి, ఇలా కూర్చోండి.

రా వు

అరే, ఆ సూటుతో కింద ఎలా కూర్చుంటారు?

ప్ర భా వ తి

మరి, కుర్చీలో కూర్చుంటే అభినయం ఎలాగండీ?

పి ళ్ళై

[తొందరపడుతూ లేచి] బయంలే, బయంలే, ముక్కెప్పేన రావ్గా, కూసుంటుమబ్బా, కూసుంటుము! [కష్టపడి పద్మాసనం వేసుకుని కూర్చుంటాడు]

రా వు

[పిళ్ళై వెనకగా కూర్చుంటాడు]

ప్ర భా వ తి

[త్రిభంగిగా నిలబడి, కొంగు ముదరకు తీసి దోపుకుని. పిళ్ళైని ఓరగా చూసిపాట ప్రారంభించి, అడుగు వేసి, ముదర మోకాలు అని, కూర్చుని హస్తాలు పడుతూ అభినయిస్తుంది]

అందాలకు హారతి నీ
సుందరపదనారవిందము
అందాలకు హారతి నీ...

పిళ్లై

[హుషారుగా కాళ్ళూడూపుతూ ఆనందిస్తూ, మధ్య మధ్యను రావుని హెచ్చరిస్తూ, ప్రభావతికి కన్నువిసరుతూ, పారవశ్యంలో పడిపోతాడు]

ప్రభావతి

ఎందు దీని కెనలేదుర
కందర్పుని దర్పణముర!
ఎందు దీని కెనలేదుర—

పిళ్ళై

[పరవశత్వం పట్టలేక] అ డ డ డ డా!

ప్రభావతి

అడడడడా అందకాడ
తడబడకుర ఝడియకురా,
అడడడడా అందకాడ...

[రెండవసారి "జడియకురా" దగ్గర చెంపమీద కొట్టబోతుంది. పిళ్ళై కంగారుపడి వెనుకకు జాగిపోయి ముఖ్యప్రాణరావుని చూస్తాడు. ముఖ్యప్రాణరావు "భయంలేదన్నట్లు" సౌజ్ఞచేస్తాడు. ప్రభావతి ఫక్కుమని నవ్వి, పిళ్ళైని చేయిపట్టి ముందరకు లాగుతుంది. పిళ్ళై ముందుకు జరిగి మామూలుగా కూర్చుంటాడు. ప్రభావతి "అడడడా"తో ప్రారంభించి "జడియకురా" దగరకు వొచ్చేటప్పటికి పిళ్ళై ధైర్యంగా బుగ్గ యిచ్చి కొట్టమంటాడు. ప్రభావతి బుగమీద చిన్న చిటికవేస్తుంది. పిళ్ళై ఒళ్ళుతెలియనితనంలో పడిపోతాడు]

ప్రభావతి

ఘడియలోనె కంతుడు లో-
గడియతీసి నడిపించుర!

అందాలకు హారతి నీ...

[పదం పూర్తిగా అభినయించి చలాకీగా లేచి వెనుకకు అడుగువేసి ఒక భంగిమంలో నిలుస్తుంది]

పిళ్ళై

[బ్రహ్మానందంతో వెనుకకు వొరిగిపోయి రెండుచేతుల మీదనూ ఆని, ముఖం పైకి యెత్తి తలఆడిస్తూ, గుక్కపట్టి] పెరబావదీ, పెర బావదీ; నంబ మనస్సు జిల్లా తైరువడదా అయిపూడిసింది! [అంటూవుండగా బైట మోటారుహారన్ వినబడుతుంది. రావు అది విని కంగారుగా లేస్తూ]

రావు

పిళ్ళైగారూ, పిళ్ళైగారూ, జమీందారు జమీందారు [అంటూ గాభరాపెట్టేస్తాడు]

పిళ్ళై

[కాళ్ళు తొక్కుకుంటూ] వో, వో, వో, [అంటూలేచి అటూ ఇటూ పరుగెత్తబోతాడు]

రావు

[పిళ్ళైని లోపల గదిలోకి తోసివేసి] ప్రభావతీ, ప్రభావతీ, జాగ్రత్త నామాట... [అంటూ ప్రభావతినికూడా గదిలోకి తోసివేసి రెండవవైపు గుమ్మంకేసి గాభరాగా పరుగెడుతూవుండగా]

తెర తొందరగా

# 2

ప్రభావతి టైప్‌రైటర్ వద్ద కూర్చుని, కూనిరాగం తీస్తూ, చిన్న కార్డు మీద అక్షరాలు చెక్కుతూవుంటుంది. గుమ్మం అవతల ఏదో చప్పుడు విని ఆత్రుతగా అటుమాని, ఆ కార్డు దాచివేసి, అక్షరాలు టకటకా నొక్కుతూ, కూనిరాగం ప్రారంభిస్తుంది. ఇంతలో ముందు ముఖ్యప్రాణరావూ, ఆ వెనుక శ్రీవారూ, అంకమ్మ ప్రవేశిస్తారు.

## శ్రీవారు

వయస్సు 30. పొడుగ్గావుంటాడు. ముక్కూ, కళ్ళూ ఒక తీవిని సూచిస్తవి. చివరలు కొంచం పైకితిప్పిన సన్నని మీసకట్టు వుంటుంది. జాగ్రత్తగా కత్తిరించిన క్రాపు, డబుల్ బ్రెస్టు కోటూ, సూటూ, ఎడమ చేయి చిటికెన వ్రేలికి వజ్రం ఉంగరమూ, మనిషికి ఒక దర్జానూ, ఒక నిరాడంబరతనూ కల్పిస్తవి.

మాటలోనూ పద్ధతిలోనూ ఒక వాక్చతుర్యమూ, మంచి నటుడిలా గోచరించినప్పటికీ, మంచితనానికి మనసిచ్చే సౌమ్యుడు అనిపిస్తాడు, మనసు మాత్రం.

రా వు

దయచేయండి, దయచేయండి! మా ఇన్‌స్పెక్టర్‌గారు కూడా ఇప్పుడే వొచ్చారు. లోపల స్నానం చేస్తున్నారు. శ్రీవారుకూడా బాగా సమయానికి దయచేశారు. ఇలా దయచేయండి...అమ్మమ్మమ్మమ్మ...ఈ కుర్చీ...ఈ కుర్చీలో దయచేయండి.

ప్ర భా వ తి

["ఇటు చూడండి" అన్నట్టు చిన్న దగ్గు దగ్గి, శ్రీవారిని ఓరగా చూసి, పైటా చీరా సర్దుకుని, పైపు టకటకా కొడుతుంది]

శ్రీ వా రు

[ప్రభావతిని ఒక్క తృటి చూసి, కుర్చీలో కూర్చుంటూ, ముఖ్య ప్రాణరావుతో] మీ ఆఫీసు చాలా బాగుంది. [మళ్ళీ ప్రభావతిని చూస్తాడు]

రా వు

చిత్రం, చిత్రం, మాది అమెరికా కంపెనీ...

ప్ర భా వ తి

[ఒక కాగితం పట్టుకుని, శ్రీవారివేపు వెళ్తూ] చూడండి పంతులుగారూ, ఈ వుత్తరానికి జవాబు ఇవాళే పంపాలా, లేకపోతే రేపు పంపవొచ్చా ?

రా వు

[గతుక్కుమని తెల్లబోయి, మళ్ళీ సర్దుకొని, ఆమెకు తొందరగా ఎదురు వెళ్ళి, జమీందారుకీ ఆమెకూ మధ్య నిలిచి, "ఏమిటిది అక్కడ కూర్చో" అన్నట్టు కళ్ళతో బెదిరించి; ఆ కాగితం చూసి, తిరిగి యిస్తూ]

ఇదా, అర్జంటే, కానీ అమెరికా వెళ్ళవలసిన జవాబు కనుక ఆలోచించి మరీ పంపాలి. ఈరోజు మనకి వ్యవధిలేదు. జమీందారుగారు దయచేశారు. వారికి ఆలస్యంకాకుండా, వారి ప్రపోజల్ రాతకోతలూ, డాక్టర్ పరీక్షా పూర్తిచేసి [రూపాయి మోగించినట్టు సౌంజ్ఞ చేస్తూ] ప్రీమియంకూడా ఈదినమే కట్టే యేర్పాటు చేయాలి.

ఈ కాగితాలు అలావుంచి, మామూలు జవాబులు మాత్రం కొట్టేయండి! [వెనుక్కి తిరిగి వెళుతుంటాడు]

ప్ర భా వ తి

["అలాగే" అన్నట్టు తలవూపుతూ ఒక అడుగు ముందుకువేసి] శ్రీవారికి నమస్కారాలు, తమ పరిచయంవల్ల ధన్యురాలిని...

రా వు

[ఇటు తిరిగి తబ్బిబ్బై, సర్దుకొని] ఆ, మరిచిపోయాను. శ్రీవారు కల్యాణపురం రాజాగారు!... కిందటివారం ఆ పెద్ద వుత్తరం మీరు టైప్ చేశారే, అది వీరికే...

ప్ర భా వ తి

ఔను, ముఖస్థంగా కాకపోయినా ఉత్తరాలవల్లనూ, ప్రఖ్యాతివల్లనూ, శ్రీవారు నాకు పరిచితులే ఇప్పుడు శ్రీవారితో సరియైన పరిచయం కలగడం మరీభాగ్యం... [మళ్ళీ నమస్కరిస్తుంది]

శ్రీ వా రు

[నమస్కారం అందుకున్నట్టు తలవూపుతూ] చాలా సంతోషం... ఈ పరిచయం ఇలా ప్రారంభమైనందుకు మాకుకూడా ఆనందం...!

5)

### రా వు

[ఏదో వికారంగా అయిపోతూవున్న ముఖాన్ని సర్దుకుని] వీరు శ్రీమతి ప్రభావతీదేవిగారు; మా కంపెనీలో టైపిస్ట్‌గా పని చేస్తున్నారు. [ప్రభావతితో] మీరు దయచేసి మీపని చూడండి... ఆ వుత్తరాలన్నీ ఇవాళ పోస్టుకి వెళ్ళకతప్పదు... ఈ దినం మనకి బోలెడు వ్యవహారం వుంది... వెళ్ళండి!

### ప్ర భా వ తి

[లోలోపల నవ్వుకుంటూ వొయ్యారంగా టైప్‌రైటర్ వద్దకు వెళ్ళి కూర్చుని, ముఖానికి పౌడరు అద్దుతూ సంభాషణ వింటూ, శ్రీవారిని కనిపెడుతూ వుంటుంది]

### రా వు

[ఆమె వైఖరి బాధపడుతూ చూసి; చిరునవ్వు తెచ్చుకుని శ్రీవారి వైపు తిరిగి] మాది, అమెరికన్ కంపెనీ సార్! అందుచేతను మన దేశంలో వాళ్ళకున్న ఆఫీసులన్నీ కూడా అమెరికా పద్ధతులనే ఆకర్షణీయమైన కొత్తవిధానాలను ఏర్పాటు చేయమంటే మద్రాసు ఆఫీసువాళ్ళు అక్కడనుంచి ఈమెను ఇక్కడికి పంపించారు.

### ప్ర భా వ తి

[పెదవికి లిప్‌స్టిక్ అంటిస్తూవుంటుంది]

### శ్రీ వా రు

[ప్రభావతిని చూస్తూ] ఈ పద్ధతి చాలా బాగుంది [చేయి పైనకు చాపితే అంకయ్య సిగరెట్ తీసి అందించి, శ్రీవారు సిగరెట్ నోట్లో పెట్టుకోగానే, అగ్గిపుల్లగీసి వెలిగిస్తాడు]

రావు

చిత్తం, చిత్తం, అంతేకాదు: తమవంటి పెద్దజమీందారులు ఆదరిస్తే, 'కాన్వాసింగ్'కి కూడా చక్కని ఆడవాళ్ళనే పెడదామని యత్నిస్తున్నాను. అప్పుడే బి. ఏ ఫైలైన ముగ్గురు స్త్రీరత్నాలతో మాట్లాడిస్తున్నాను. అందుచేతనే, భీమా తమర్ని ఒక లక్ష రూపాయీలకైనా చేయమని ప్రార్థిస్తా! తమరు ఒక లక్షకు ఇన్స్యూర్ చేస్తే, తమ ఆసరా చూసుకుని, పది మంది జమీందారుల్నీ పట్టుకోవొచ్చునని ఆశిస్తున్నాను. ఆ మాత్రం వ్యాపారం అందుబాటుకి వొచ్చిందంటే, కంపెనీ అంతా చక్కని ఆడవాళ్ళతోనే... .

ప్రభావతి

[షైఫ్ రైటర్ వద్దనుంచి తీచి; ఫైలు చూపిస్తూ] చూడండి పంతులుగారూ, దీనిలో ఆ కాగితం లేదండి...

రావు

[ఎదురు వెళ్ళి తీవ్రంగా] ఈమాత్రం ఆలోచన లేకపోతే యెలాగ?... పెద్దవారు శ్రీవారితో వ్యవహారం మాట్లాడుతూ వుంటే, అనవసరంగా కాగితాలూ గీగితాలూ అని అడ్డు రావడం...

ప్రభావతి

[నిర్లక్ష్యంగా] పొరబాటైతే క్షమించండి పంతులుగారూ; ఆ కాగితం అర్జంటన్నారుకదా అని అడిగాను... [అతి వికటంగా] పొరబాటు ... [శ్రీవారితో] మధ్యలో అడ్డువొచ్చినందుకు శ్రీవారు క్షమించాలి...చాలా పొరబాటు చేశాను.

శ్రీ వా రు

[ఓరగా ప్రభావతిని చూస్తూ] దీనిల్లో పొరబాటులేదు... క్షమాపణ అనవసరం... ఎవరి అర్జంటు పనులు వారు ముందుగా చూసుకోడం తప్పుకాదు.

ప్ర భా వ తి

[భావయుక్తంగా] శ్రీవారు చాలా సరసమైనవారు...

రా వు

ప్రభావతీదేవిగారూ, మీరు లోపలికి వెళ్ళండి. కొంచం దయచేసి చూడండి మన ఇన్‌స్పెక్టరుగారు సిద్ధంగావున్నారేమో?

ప్ర భా వ తి

[కొంటెతనంగా] చూడమంటారా? పిళ్లెగారు స్నానాల గదిలో వున్నారేమో? [నిర్లక్ష్యంగా టైపురైటర్ వద్దకు వెళ్ళిపోతుంది]

రా వు

[నిట్టూర్చుతూ] చదువుకున్న ఆడవాళ్ళందరితోనూ ఇదే చావు.

[ప్రభావతిని తీవ్రంగా చూస్తూ గదిలోకి వెళ్తాడు]

శ్రీ వా రు

[సిగరెట్టు పారవేసి చిరునవ్వు నవ్వుతూవుంటాడు]

ప్ర భా వ తి

[ముఖ్యప్రాణరావు వెళ్ళడం కనిపెట్టి శ్రీవారికి ఒక చిరునవ్వు విసురుతుంది. లేచి బల్లవద్దకువెళ్ళి గుమ్మంవేపు చూసేటప్పటికిముఖ్యప్రాణ

రావు వొస్తుంటాడు. అతనిరాక కనిపెట్టి ఆందోళనతో ఒక ఫైలు తిప్పి చూసి] ఆ కాగితం ఇదిగో దీనిలో వున్నదండీ పంతులుగారూ!
[టైపురైటర్ వద్దకు వెళ్ళిపోతుంది]

రా వు

['సరే కానియ్యి' అన్నట్టు తల పంకించి, బల్లవద్దకు వొస్తు, కళ్ళు గిట్టగరిచి, ప్రభావతితో] అలావుండనియ్యండి. తరువాతచెప్తా ఆ కాగితం సంగతి! [శ్రీవారితో] ఇన్‌స్పెక్టరుగారు వొస్తున్నారు. తమదర్శనానికి... ఆలస్యానికి శ్రీవారు క్షమించాలి.

శ్రీ వా రు

తొందరలేదు? రానీయండి!

పి ళ్ళై

[మందహాసంతో ప్రవేశిస్తూ] వో, రాజా! రాజా, పెరియ రాజాదా! మూతిసూస్తానే తెలిసిందే...గుడ్‌మార్ణింగ్. గుడ్‌మార్ణింగ్, గుడ్‌మార్ణింగ్ రాజావారూ! [శ్రీవారివద్దకువచ్చి చేయి చాపుతాడు]

శ్రీ వా రు

[లేవకుండానే కరస్పర్శచేస్తూ] గుడ్‌మార్నింగ్; కూర్చోండి!

పి ళ్ళై

[ప్రభావతి టైపుచేయడంచూసి] వో. పెరబావదీ. టైపు చేస్తువా. టైపు!...

రా వు

[కూర్చోకుండా] పిళ్ళైగారూ, కూర్చోండి. [శ్రీవారితో] డయికలప్ప పిళ్ళైగారు, ఇన్‌స్యూరెన్సులో చాలా అనుభవం

గలవారు. ఈ అమెరికాకంపెనీకి మద్రాస్ ఆంధ్రరాష్ట్రాలలో శాఖలు నిర్మించి, ఈ కంపెనీని వ్యాప్తిచేశారు. వ్యాపారంలో, అందులోనూ భీమా వ్యాపారంలో, వీరిని మించినచేయి, మన దేశంలో లేదనే నానమ్మకం.

పి ళ్ళె

[దర్జాగాటీస్తూ విని] మ్చ్ మ్చ్ మ్చ్. ఎందుకబ్బా ఆల్ దిస్ హిస్టారీ, మనకిదా వుండింది సెగితి, ఎన్నమో సేస్తిమి వేబారం. ఆరుముగంసామి దయదావుండిది మనపైన; అంతదా! ఏమి తెలుస్తురు రాజావారు? సొళ్ళుంగో?

శ్రీ వా రు

ఏవ్యాపారంలోనైనా మీా అరవవాళ్ళు చాలా ఘట్టి వాళ్ళు. ఈవిషయంలో మీాకున్నశక్తి మాఆంధ్రులకు లేదు.

పి ళ్ళె

[బిగ్గరగా నవ్వుతూ] రైట్టు, రైట్టు, రైట్టు, సార్ [ముక్త్యప్రాణరావుని హేళనచేస్తు] ఎన్నా, ముక్కప్పినరావూ, గమనిస్తివా రాజావారి ఒబినియన్! [శ్రీవారితో] అదిదాసార్ నాన్ సొల్రదు; మీాఆన్ దిరులకు తెలివివుండాదిసార్. సెగితి వుండాది, బట్ ఆల్ హేస్టసాక్, శుమ్మా హేస్టు...యదిలో కూడ బిరబిరబిరా పూడుస్తురు: నిల్చేదిలేదుసార్; అద్దా పెద్ద లోబం; పెరియడిఫెక్టు.

శ్రీ వా రు

పిళ్ళెగారు చెప్పింది నిజమే!

### పి ళ్ళై

ముక్కి-ప్పేనరావుగారూ గమనిస్తివా... అదిడానే నేను దినాము సెప్పేది...[శ్రీవారిని గొప్పగామాస్తు] రాజావారు పెరియప్ర్యోజన మనిసే...ఆ. నల్లాథింకర్ రాజావారు. యిదు కుదా అప్రియోజన అవసరం సార్. అదిడా నాన్ సొల్రేదు:

### ప్ర భా వ తి

[టైపురైటరు వద్దనుంచి లేచివొస్తు]పంతులుగారూఆవు త్తరం పూర్తిఅయింది... ఇంకా...

### రా వు

[చిరాకుగలేచి ఎదురువెళ్లి, చికాకుపడుతూ, గొంతుకలో ఒక బాధతో] ప్రభావతీదేవిగారూ, మేమేదో వ్యాపారంలో ఉన్నప్పుడు మీరు మాటిమాటికీ అడ్డురావడం భావ్యంకాదు! మీకు టైప్ పని అయితే, రికార్డురూంలో ఫైళ్ళు ఆర్డర్‌లో పెట్టండి... దయచేసి మీరు లోపలకు వెళ్ళండి...

### ప్ర భా వ తి

[భూతరుచేయుతుండా] అడ్డువొచ్చినందుకు క్షమించండి. శ్రీవారికి కాఫీ సిద్ధంగా వుంచాంగదా, వ్యాపారథోరణిలో మరచి పోతారేమో; జ్ఞాపకం చేద్దామని వొచ్చాను...

### పి ళ్ళై

వో, వో, వో, నిండా,బాగాజ్ఞప్తి చేస్తివి, పెరబావడి. థేంక్సు, థేంక్సు, నిండా, థేంక్సు... తెచ్చేద్దానే కాఫి

[శ్రీవారితో] రాజావారూ, మనకి ఒక్కటిదా ప్రిన్సిపుల్: ఈట్ వెల్ వర్క్ వెల్... ఎన్నాసార్ ఇదియెల్లాం [పొట్టమీద కొడుతు] ఇదుకుదాదే!

ప్ర భా వ తి

[నవ్వుతూ లోపలకు వెళ్తుంది]

శ్రీ వా రు

పిళ్ళైగారు చాలా అనుభవశాలురు!

పి ళ్ళై

[ఆనందంతో] ఆమాంసార్, ఆమా ఆమా, ఎనకు నిండా ఎక్సిపీరియన్స్, వరల్డ్‌లీ ఎక్సిపీరియన్స్ వుండాదిసార్!

రా వు

పిళ్ళైగారూ, శ్రీవారు పదిహేను సంవత్సరాల ఎండో మెంట్ పోలసీ తీసుకుంటే...

పి ళ్ళై

అవసర పడాదే, అవసర పడాదే, ముక్కియ్మైనరావ్లా అవసరపడాదే! తీస్తురబ్బా తీస్తురు! రాజావారు, ఎణ్డోమెణ్ట్ పోళసీదా తీస్తురు... వొణ్ లేక్ వారు లచ్చరూబాయలకు తీస్తుర్రు!

ఇరబ్బా, ఇరు... కాఫీ బోంచేసి, వక్కాకు వేసి- సిగరెట్ తా-గ-తా యోజన చేస్తురు... అప్పొదానే మైణ్డ్ నవి క్కమా వుండును. [శ్రీవారితో] ఎన్నాసార్! అద్దానే నల్లా వేబార లచ్చనం?

శ్రీ వా రు

పిళ్ళైగారు, చాలా ఘట్టి వ్యాపారస్తులు!

పి ళ్ళై

థేంక్స్, థేంక్స్, నమకు తెల్సును సార్ బిగ్ బిగ్ రాజాస్ మైండ్ !

రా వు

పిళ్ళైగారూ, ఫారమ్స్ తీసుకువొస్తాను...[తీస్తాడు]

పి ళ్ళై

[ముఖ్యప్రాణరావుని చేయపట్టి ఆపుతూ ]అడాడాడాడే, యెన్నా సార్ అవుసరం...నీకు తెరియాదు, ఉక్కారబ్బా ఉక్కారు!..

[గుమ్మంవేపు తిరిగి] పెరబావదీ, పెరబావదీ, బిన్నే వొచ్చేద్దానే!

ప్ర భా వ తి

[లోపలనుంచి] వొస్తున్నా !

రా వు

[నిట్టూర్చి కుర్చీలో కూలబడిపోతాడు]

ప్ర భా వ తి

[కాఫీ ప్లేసూ, టిఫినూ, కప్పులూ ఉన్న ట్రే పట్టుకుని ప్రవేశిస్తూ] శ్రీవారికి తగినకాఫీ ఉండవలెనని డికాక్షను బాగా చేయడంలో ఆలస్యమైంది... శ్రీవారు క్షమించాలి ఆలస్యానికి!

శ్రీ వా రు

మంచిది, మాకు కాఫీలో డికాక్షను కొంచెం జోరుగానే వుండాలి.

ప్ర భా వ తి

తమ అభిరుచులు నేనుసరిగ్గా గ్రహించానన్నమాట!

శ్రీ వా రు

[ఔనన్నట్టు తల ఊపుతాడు]

పి ళ్ళె

[ఉత్సాహంతో] ఎనకుకూడ అఫ్డీసార్ డిగాక్షన్ స్ట్రాంగా ఇరకణం.

ప్ర భా వ తి

[కప్పులు ఎదరను పెడుతూ] కాఫీ పొయ్యమని సెలవా, లేక ముందు టిఫిను...

శ్రీ వా రు

మాకు టిఫినువొద్దు, కాఫీమాత్రం...

పి ళ్ళె

ఎనకుకూడ శుమ్మా కాఫీదా...

రా వు

[నిరాశతో యింటి కప్పుకేసి చూస్తుంటాడు]

ప్ర భా వ తి

[కాఫీ మూడుకప్పులలోపోసి, ఒకటి శ్రీవారి యెదరనూ, ఒకటి పిళ్ళె యెదరనూ ఉంచి మూడవది ముఖ్యప్రాణరావు ముందరకుతోసి, శ్రీవారి పక్కనున్న ఖాళీకుర్చీని ఆని నిలుస్తుంది.]

శ్రీ వా రు

ఎందుకూ అలా నిలవడం? బంతిలో బాలశిక్ష పనికి రాదు. ఇచ్చినవాళ్ళుకూడా పుచ్చుకోనిదే పార్టీ పూర్తికాదు.... చదువుకున్న వారికి సందేహం వుండకూడదే సరసను కూర్చో డానికి!

పి ళ్లై

ఆమా ఆమా ఆమా, రాజావారు నైస్గా చెప్తిరి... పెరబావదీ, ఉక్కారు, ఉక్కారు... బోంచేసేద్దానే కాఫీ [తనకప్పు ఆమెకు ఈయబోతాడు)

ప్ర భా వ తి

[చేయి అడ్డుపెడుతూ] థేంక్స్. వొద్దండీ నేను ఆ కప్పు తీసుకుంటాను. ఈకప్పు మీరు భోంచేయండి [కూర్చుని, మరొక కప్పు తీసుకుని కాఫీ పోసుకుంటుంది]

[శ్రీవారు కాఫీ తాగుతూ ప్రభావతిని ఓరచూపులు చూస్తుంటాడు. ప్రభావతి కాఫీ రుచిచూస్తూ శ్రీవారిని పక్కనుంచి చూస్తూవుంటుంది]

పి ళ్ళై

[ఒక్క గుక్క లాగేసి, 'ఛే' అని తేన్చి, బొజ్జ నిమురుకుంటూ పరధ్యానంగావున్న ముఖ్యప్రాణరావుని చూసి] ఎన్నాప్పా, ఎన్నా ఇది? కాఫీ భోంచేసేది లేదా?

రా వు

ఆఁ– [తాగబోతాడు]

[శ్రీవారు కాఫీకప్పు కిందపెడతాడు. ప్రభావతి బల్లమీద వున్న సిగరెట్ కేస్ తీసి, దానిలోనుంచి రెండు సిగరెట్లు తీసి, ఒకటి శ్రీవారికీ, మరొకటి పిళ్ళైకూ ఇచ్చి, అగ్గిపుల్లగీసి, ముందు శ్రీవారి సిగరెట్టూ, తరువాత

పిళ్ళై సిగరెట్టూ వెలిగించి, సిగరెట్టుకేసూ, అగ్గిపెట్టి ముఖ్యప్రాణరావు రెండరకు నిర్లక్ష్యంగా విసురుతుంది]

పి ళ్ళై

థేంక్స్, థేంక్స్, పెరబావదీ!

రా వు

[ఈ దృశ్యంచూసి తాగబోయిన కాఫీ బల్లమీద పెట్టేస్తాడు]

పి ళ్ళై

[అదిచూసి] ఎన్నాయ్యా, కాఫీ జిల్లాఅయిప్పూడ్చును... బోంచేయబ్బా, బోంచేయి...

రా వు

[కాఫీ తాగుతుంటాడు]

పి ళ్ళై

[అమాయకంగా ప్రభావతితో] పెరబావదీ, సేస్తువా అపినయం రాజావారికి...

[రావు ఈమాట విని, ఉల్లిపడి కాఫీ నోలకబోసుకుని, ఉక్కిరిబిక్కిరి అయిపోయి, పొరమారి, దగ్గులో పడిపోతాడు. శ్రీవారూ, ప్రభావతీ ఒకరిని వొకరు చూసుకుని నవ్వుతుంటారు]

పి ళ్ళై

[ముఖ్యప్రాణరావుని చీవాట్లువేసే గొంతుకతో] ఎన్నాయ్యా, ఎన్నాఅది. ఎదిదా స్లోఆ చేసేద్దానే; ముక్కిప్పేనరావ్వా, ఎదుకబ్బా హేస్టు, హేస్ట్ మేక్సవేస్టు...యదుకుకూడ బిరబిరబిరా పూడ్చేది కూడాదబ్బా...

రా వు

[సర్దుకుని] హు, హు, హు... శ్రీవారితో ఏదో అన బోతే పొరమారింది...హు, హు, హు...

శ్రీ వా రు

ఆగి సర్దుకుని చెప్పండి, ఫరవాలేదు.

రా వు

ఏమీలేదుసార్! ప్రభావతీదేవిగారు మెడ్రాసులో చదువు కున్నారు... ఈరోజులలో అక్కడ చాలామంది చదువుకున్న వాళ్ళు నృత్యమూ, అభినయమూ కళకోసమని నేర్చుకుంటు న్నారు....

శ్రీ వా రు

ఔ నా ను. [ప్రభావతిని క్రీగంటచూస్తూ] మద్రాసులో పెద్దలు కొందరు ఈ యత్నాలు చేస్తున్నారు.

పి ళ్ళై

వో, అదివా? పెరబావదీ మెడ్రాస్ సూస్తివా? పట్నం లో నేరిస్తివా అపినయం! పట్టేద్దానే అపినయం రాజావారికి.

[శ్రీవారు ప్రభావతీ నవ్వుతారు]

రా వు

['చచ్చాంరా' అన్నట్లు కంగారుపడుతూలేచి] పిళ్ళైగారూ, కొంచం దయచేయండిసార్ ఇలా... [చేయి గోకుతూ] ఆ... కాగితాలు...ఆ ఫారమ్స్‌సార్...అవీ...మనం...శ్రీవారికి...

[శ్రీవారితో] కొంచం... రెండునిమిషాలు... క్షమిం చాలి...శ్రీవారు.

పిళ్ళె

[అర్థంకాక ఇటూ అటూ చూసి] వొచ్చేదా, వొచ్చేదా, ముక్కిప్పేనరావూ అవసరంవా? [లేచి ముఖ్యప్రాణరావుని అనుసరిస్తూ]

రాజావారూ రెండు నిమిషం సార్... [గదిలోకి వెళ్తాడు]

రావు

[గుమ్మం ఇవతల ఆగి] ప్రభావతీదేవిగారూ, కొంచెం ఇలా వొచ్చి ఆ వుత్తరానికి ఎడ్రస్‌కూడా వెంటనే టైప్‌చేసివేయండి!

ప్రభావతి

[ఏమీ ఎరుగనట్టు లేచివొస్తూ] ఆ అమెరికావుత్తరానికేనా? [టైప్‌రైటరుదగ్గరకు వెళ్తుంది]

రావు

[ఆమె టైప్‌రైటరుదగ్గర కూర్చుండే వరకూ ఆగి పళ్ళు గిట్టగరిచి] ఆ, అవుత్తరానికే! [లోపలికి వెళ్తాడు]

ప్రభావతి

[టైప్‌రైటరుదగ్గ కూర్చుని ముఖ్యప్రాణరావు వెళ్ళేవరకూ ఆగి, శ్రీవారిని విలాసంగా చూస్తుంది]

శ్రీవారు

[మీసం తిప్పుతూ ఖుషీగా చూస్తాడు]

ప్రభావతి

[వొయ్యారంగా లేచి, బల్లవద్దకువెళ్ళి, శ్రీవారిప్రక్కను నిలిచి ఒక పైటు తిప్పుతూ నిలబడుతుంది]

శ్రీ వా రు

ఎవరో అడగవచ్చునా ?

ప్రభా వ తి

తమవద్దనా నాకు దాపరికం... మేం కళావంతులం !

శ్రీ వా రు

[తల పంకిస్తూ] జమీందారులంటే పంతులు ఏమో అను కున్నట్టున్నాడు...మాకున్న శక్తులు ఆచచ్చునాగమ్మకు తెలియవు !

ఓరచూపు చూసి వారకాంత పోంకమూ, ఆరు తీరు చూసి పందెంపుంజు బింకమూ కనిపెట్టడంలో మనల్ని మించిన వారు లేరు...

ఇల్లెక్కడ ?

ప్రభా వ తి

[ఆందోళనతో] క్షమించండి. తమతో సంప్రతించడానికి అవకాశం వుండదేమో అని, ఈకార్డుమీద రాసివుంచాను. [కార్డుఇచ్చి, చేయిపట్టుకుని] మళ్ళీ వాళ్ళు వొస్తారేమో; తమరు ఎప్పుడు కబురుచేసినాసరే; మాచెల్లీ నేనూ కూడా వొస్తాం... లేదా, తమకు అనుగ్రహంకలిగి మాయింటికి దయచేస్తిరా మేం ధన్యులం...తమ మర్యాదలకు ఏలోపమూ వుండదు...

శ్రీ వా రు

[చేయి తీసుకుని] ఈ సాయంత్రం...

ప్ర భా వ తి

తప్పకుండా దయచేయండి...అయ్యో అంతకన్నానా!... వాళ్ళు వొస్తూన్నట్టున్నారు...పంతులు అసలే అనుమానం మనిషి... [రావు రావడం కనిపెట్టి కొంచం ఎడంగా వెళ్ళి, ఏమీ ఎరగ నట్టుగా తలవొంచి నిలబడి] చిత్తం, ఉత్తరాలు ఆ ట్టేవుండవు...

రా వు

[ప్రవేశించి గుమ్మంవద్ద నిలబడి అనుమానంగాచూస్తూ, వింటాడు]

ప్ర భా వ తి

మహావుంటే, రోజుకి పదిహేనూ ఇరవైకన్నా ఎక్కువ వుండవు... పెద్ద వుత్తరాలుంటే, ఒకొక్కప్పుడు పంతులు గారే టైపు చేసేస్తారు....

శ్రీ వా రు

టైపుకొట్టడం జోరుగా నేవుంది !

ప్ర భా వ తి

క్షమించండి, వొస్తాను. ఇంకా ఉత్తరాలు కొట్టవలసినవి ఉన్నవి... పోస్టు దాటిపోతే పంతులుగారు ఆగ్రహిస్తారు. [ముఖ్యప్రాణరావుని చూడనట్టుగా టైపురైటర్ వద్దకు వెళ్ళి, జోరుగా అక్షరాలు నొక్కుతూ వుంటుంది]

రా వు

['కొంపముంచిందా' అన్నటు ప్రభావతిని చూసి మళ్ళీ సద్దుకుని; శ్రీవారివైపు తిరిగి చేతిలోని కాగితాలు నూచిస్తూ] శ్రీవారు క్షమించాలి ఆలస్యానికి, ఈఫారాలు వెతకడం ఆలస్యమైంది పిళ్ళై గారు కూడా వొస్తున్నారు...

పిళ్ళై

[ప్రవేశిస్తూ] ఇదో వొస్తినే, రాజావారూ పెరబా వది... పట్నంలో... అభినయం...

రావు

పిళ్ళైగారూ, క్షమించండి, శ్రీవారిది చాలాపెద్దయెస్టేటు: వారికి అనేక పనులుంటవి... మన వ్యవహారం తొందరగా తెమిల్చివేస్తే. సాయంత్రం, శ్రీవారికి [illegible] బంగళావద్ద ఖులాసాగా కాలక్షేపం చేయవొచ్చును.

పిళ్లై

వోవోవో, సాయందరం రాజావారి పేలెస్‌లో వేస్తుము గాలక్జేబం... శరిశరిశరి [శ్రీవారితో] ఎన్నానార్, సేసివిడుస్తుమా బిజినెస్సు?

ప్రభావతి

[బల్లవద్దకు వొస్తూ] పంతులుగారూ, ఇది కొట్టేశాను... రెండవ ఉత్తరం...

రావు

[వాళ్ళు మండిపోతూ] ఉత్తరాలూ గిత్తరాలూ అలా వుంచండి... దయచేసి మీరు ఆఫీసురూంలో పని చూడండి: వెళ్ళండి... దయచేసి వెళ్ళండి!

ప్రభావతి

[వెనుకకు తిరిగి, మాట తిప్పుకుంటూ నిర్లక్ష్యంగా టైప్‌రైటరు వద్దకు వెళ్ళి కూర్చుని అక్షరాలు గబగబా నొక్కి గాభరా పడుతూ]

అమ్మయ్యో పిళ్ళైగారూ, ఇదేదో చెడిపోయిందండి, అన్ని అక్షరాలూ పైకి వెళ్ళిపోయి దిగడంలేదండీ...

పి ళ్ళై

[అటు వెళ్తూ] బయపడాదే, బయపడాదే, పెరబావదీ. [అక్షరాలన్నీ కిందకు సర్దినవ్వుతాడు. ప్రభావతి పిళ్ళైతో గుసగుసలాడుతూ వుంటుంది. శ్రీవారు ఫకాల్మని నవ్వుతాడు]

రా వు

[గాభరా సర్దుకుని, తెగించి] శ్రీవారు చిత్తగించి ఈ ప్రొపోజల్ ఫారమ్ పూర్తిచేసి సంతకం పెడితే...

శ్రీ వా రు

[లేచి నిలబడుతూ] మేం మా బావగారి ఇంటినుంచి వొస్తూ, మీరు రమన్నారుకదా అని కేవలం మర్యాదకు ఇక్కడకు వొచ్చాం. ఇక్కడ వ్యవహారంచేయడం గౌరవంకాదు. సాయంత్రం ఆరుగంటలకు పిళ్ళైగారూ మీరూ మా బంగళాకు దయచేయండి... అక్కడ తప్పకుండా పరిష్కారం చేస్తాం మీవ్యవహారం...మరి మేం వెళ్తాం!

పి ళ్ళై

[శ్రీవారి దగ్గరకు వొస్తూ] శరి శరి శరి. నిండా థేంక్స్‌సార్. నిండా థేంక్స్...అట్లాదా సేస్తుము, ఆట్లాదా సేసేది. అద్దా రైటుసార్ ...రాజావారు వూడుస్తురా ?

శ్రీ వా రు

మంచిది! [పిళ్ళై, రావు నమస్కరిస్తారు. శ్రీవారు నమస్కారాలను అందుకుంటూ, ప్రభావతిని ఒకవిధంగాచూసి వెళ్ళిపోతాడు

పిళ్ళై, ముఖ్యప్రాణరావూ వెంట వెళ్తారు. ప్రభావతి ఆ చూపు అందుకుని 'అలాగే' అన్నట్టు సౌంజ్ఞచేసి వాళ్ళు వెళ్ళగానే బల్లవద్దకు వెళ్ళి, కూని రాగంతీస్తూ కుర్చీలో కూర్చుంటుంది]

## రా వు

[ప్రవేశిస్తూ] నీసంగతి నేను గ్రహించలేదనుకున్నట్టు న్నావ్! మీ దుర్మార్గపుజాతికి దుస్తంత్రాలూ దురుద్దేశాలూ కాకపోతే సజావైన సన్మార్గాలు యేడవ్...

## పి ళ్ళై

[వెనకనుంచి ప్రవేశించి, విని] ఎన్నయ్యా, ఎన్నా వేబారం ఇది? సేస్తివి కళిదె వేబారం; గాడిదె వేబారం. [వెకిలిగా వెక్కిరిస్తూ] ఫారమ్స్, ఫారమ్స్ సార్. ప్రీమియం, ప్రీమియం సార్; మణీ. మణీసార్. [ఎగరకు వొచ్చి] ఎన్నా తలి స్తిని వేబారంనాక? హేష్టు, హేష్టు హేషు...యదుకబ్బా అప్పీ హేష్టు... పూడిసింది వేబారం; సచ్చి పూడిసింది. ఇప్పో యెన్నా సేస్తువు? నువ్వు యూజ్లెస్సయ్యా, వేబారానికి యూజ్లెస్... [ప్రభావతి పక్కకు వెళ్ళి] పెరబావది సేసును ఇదుకుమేల వేబారం...[ప్రభావతిని ఆప్యాయంగా చూస్తూ] పెర బావదీ!

## ప్ర భా వ తి

[లేచి పిళ్ళైదగ్గరగా తగిలేటట్టు నిలిచి] ఏమండీ పిళ్ళైగారూ!

## రా వు

[జాలిగా] క్షమించి కొంచెం తాళండి పిళ్ళైగారూ! ఈ వ్యాపారం తప్పకుండా జయప్రదంగా జరిగేటట్టు చేస్తాను

సాబ్; నామాట నమ్మండి !! కొంచం దయావుంచి మీరు బట్టలు మార్చుకోండి; ఇంతలో ప్రభావతితో రెండుమాటలు మాట్లాడి వొస్తాను.

ప్ర భా వ తి

[ధీమాతో] పిళ్ళైగారూ, వెళ్ళండిసాబ్; పంతులుగారు ఏదో మాట్లాడుతారట. అది విని నేనూ లోపలికివస్తాను. కాని, వెళ్ళండి!

పి ళ్ళై

పెరబావదీ. శరి శరి శరి, బిన్నే వొస్తువా?...నాన్ పూడుస్తును...

ప్ర భా వ తి

[నవ్వుతూ] ఆ ఆలాగే మీరు పూడ్చండి...తరువాత నేను వొస్తాను?

పి ళ్ళై

[ఆనందముతో ముఖం వికసించి, ప్రభావతిని అతి అప్యాయంగా చూసి] పెరబావదీ, నీయిష్టండా మన యిష్టం శరి శరి శరి! [వెళ్తాడు]

ప్ర భా వ తి

[వెళ్ళిపోతూవున్న పిళ్ళైను వొకమాద్దు వెవరి,ఫకాల్ మని నవ్వుతుంది]

రా వు

[కలినంగా] ఏమిటే, ఆ సెధవనవ్వు నువ్వు.

ప్ర భా వ తి

పోనీండి, మీకు వెధవనవ్వు కిట్టకపోతే; పునిస్త్రీనవ్వే నవ్వుతాను...

రా వు

[తీవ్రంగా] ఛాఫ్, వాగకు; ఇదేం సరియైన ఆఫీసనుకుం టున్నావా, సానిదాని శయనాగారం అనుకుంటున్నావా?

ప్ర భా వ తి

[నిర్లక్ష్యంగా సాగదీస్తూ] ఆ! సరైన ఆఫీస్సు ... అందుకే లాగుంది మేం కావలసివొచ్చింది. మాద్వారా వ్యాపారం తగ లడవలసి వొచ్చింది...

రా వు

ఆ బుద్ధితక్కువకే ఇది ఇలా తగలబడింది...నిన్ను తెచ్చు కున్నందుకు బాగా గడ్డి తినిపిస్తున్నావ్!

ప్ర భా వ తి

[నవ్వుతూ] అన్నింటికీ పన్నులు పడడంవల్ల గడ్డికికూడా ధర పెరిగింది...అందరికీ పెట్టడానికి అంత చౌకగా లేదు...

రా వు

[కళ్ళెర్రజేస్తూ] ఏం తలపొగరు! నోటికి హద్దూపద్దూ లేకుండా వాగుతున్నావ్: ఇక కట్టిపెట్టు నీ టక్కు టమారి వేషాలు?

ముఖ్యప్రాణారావంగారే వెర్రిముండాకొడుకనుకొంటున్నట్టు న్నావ్...ఖబడ్దార్?

వొచ్చింది మొదలు చూస్తున్నాను వాళ్ళకే ధోరణి? నన్ను చచ్చుకిందకట్టి నాటకమాడడం; ఆ వెర్రి పిల్లి గాడితో వెధవ వేళాకోళాలూ...

పాడు పరిస్థితులలో పట్టుబడిపోయి, కిక్కురుమనలేక కుక్కిన పేనునయిపోయాను. ఇప్పుడు చూడు నా మజాకా...

ప్ర భా వ తి

మీ మజాకావొద్దు, నా మజాకావొద్దు; మీ బాధేదో మీరే పడండి; నా కెందుకూ లేనిపోనిగోల... నాదారిని నే పోతాను [తొందరగా పోబోతుంది]

రా వు

ఏయ్, ఆగక్కడ?

ప్ర భా వ తి

[తిరిగి చూస్తుంది]

రా వు

[రెండడుగులలో గుమ్మానికి అడ్డుగా నిలిచి] నిన్ను చచ్చినా కదలనియ్యను...ఆ జమీందారుతో నీ గుసగుసలు నేను కని పెట్టకపోలేదు. ఈసాయంత్రం నావ్యాపారం పూర్తయ్యేవరకూ, నిన్ను ఇక్కడనుంచి కదలనియ్యను...ఖబడ్దార్?

ప్ర భా వ తి

అబ్బో! చాలావరకూ వొచ్చిందే...కట్టుకున్న పెళ్లాలమీదే సాగదు ఈగదమాయింపు...

రా వు

షాప్, నోర్ముయ్?

ప్ర భా వ తి

[రెండుచేతులూ మొహానికిచూపిస్తూ] ఏచేత్తో?

రా వు

[చేతులు తోసివేస్తూ] కట్టిబెట్టు నీ వెధవవేషాలు... వచ్చినట్టు ఇక్కడ కూలబడు సాయంత్రంవరకూ... వెర్రివెర్రి వేషాలు వేశావంటే జాగ్రత్త... [గుమ్మంలోనుంచి చూస్తూ] వోరేయ్ వెంకా!

వెం క డు

[అవతలనుంచి] బాబు !

ప్ర భా వ తి

[ఒకక్షణం ఆలోచించి, ఇవతలకువెళ్ళి కుర్చీలో కూలబడుతుంది]

రా వు

[సరాసరా టైప్ రైటర్ వద్దకు వెళ్ళి, అక్కడి కాగితాలు తీసి, తన కోపం వాటిమీదను చూపిస్తూ, పరపరా చింపుతుంటాడు]

ప్ర భా వ తి

[శాంతంగా] అయితే... నన్ను ఖైదు చేశారన్నమాట?
[జడ విప్పుతుంటూ వుంటుంది]

రా వు

[ఇంకా కాగితాలు చింపుతూ] ఆ, నాపని పూర్తయ్యేవరకూ

ప్ర భా వ తి

సరే, ఏంచేస్తాను; దిక్కులేని ఆడదానిని. పంతులుగారూ, పోనీ మీకు పుణ్యముంటుంది... ఇక్కడ ఒక మంచం వేయించరూ!

రా వు

ఆట్టే వాగావంటే జాగ్రత్త. టేక్కేర్! ఇకమీదచూడు నాతడాఖా [కాగితం ముక్కలు ఈడ్చి కిందకొడుతూ, చొక్కా చేతులు పైకితీస్తాడు]

ప్ర భా వ తి

[రిబ్బను బొంలంలో దోపి, ఠీవి దర్జాగా జుట్టుముడివేసి, గౌరవంగా మీదకు వెళ్తూ] నేనే అంత చేతగానిదాననా మీ ఊహ!

రా వు

[కొంచెం బెదరిచూసి] ఆ!

ప్ర భా వ తి

ఆ! అబ్బో, ఎంతధీమా! అయితే చూపించనా నా తడాఖా! [పెద్దగొంతుకతో, గావుకేకలువేస్తున్నట్టు] పిళ్ళేగారూ... పిళ్ళేగారూ... పిళ్ళేగారూ... అయ్యో... అయ్యో... అయ్యో...!

పి ళ్ళై

[లోపలనుంచి] పెరబావదీ, పెరబావదీ!

ప్ర భా వ తి

[పిళ్ళై స్వరం వినబడగానే ముఖ్యప్రాణరావుని వెక్కిరించి, గిరుక్కుమని తిరిగి పిళ్ళై రావడంచూసి) గబగబా జుట్టువిరబోసుకుని మరీ బిగ్గరగా] పిళ్ళేగారూ... పిళ్ళేగారూ...అయ్యో...అయ్యో... అంటూ, ముఖ్యప్రాణరావుమీదకు వొరిగి, అతను నెట్టేస్తున్నట్టే ఒంటుకు పడిపోయినట్టు పెద్దకేకలువేస్తూ పడిపోతుంది]

పి ళ్ళై

[ప్రవేశించి అటు తిరిగి, దిగాలుపడి ఆమెనుచూసి ]అడడడడే, ఎన్నాయ్యా ఇది; ఎన్నాయ్యా, ఆండవాళ్ళనిశుమ్మా ఏడిపిస్తుండావు చాచాచాచా [ప్రభావతిదగ్గరకువెళ్తూ జాలిగా] పెరబావదీ...

రా వు

[తెల్లబోయిచూసి, 'సాకర్మ' అన్నట్టు తల బాదుకుని కుర్చీలో కూలబడుతాడు]

పి ళ్ళై

[ప్రభావతి భుజంమీద చేయివేసి] పెరబావదీ, పెరబావదీ పరవాయిల్లై, పరవాయిల్లై; నేనుంటినేసూడుమీా, సూడుమీా, ఇప్పడి సూడిమీా [బుజ్జగిస్తూ, చేయిపట్టితేవదీస్తాడు. ప్రభావతి పిళ్ళైలాగినట్టుగా లేచి, పిళ్ళై గుండెలమీద తలఆన్చి, వెక్కి వెక్కి ఏడుస్తుంటుంది. పిళ్ళై బాధపడుతూ కళ్ళు చెమ్మగిల్లుతూ...గొంతుకులో రోదనధ్వనితో] పెరబావదీ, పెరబావదీ...

తెర, తొందరగా



# 3

నీలాచలం ఇంటిలో పడకగది. ఎదర గోడమధ్యవున్న కిటికీని ఆని రోజ్‌వుడ్ పందిరిపట్టిమంచం వుంటుంది. మంచానికి తలవైపూ కాళ్ళవైపూ నగిషీ, మధ్యలో పెద్దఅద్దాలు రెండు చట్రాలలో బిగించి వుంటవి. మంచం పక్కగా ఎడమమూలను అద్దాలబీరువా; దాని నిండుగా అరలలో పిల్కుచీరలూ, ఇతర దుస్తులూ కనుపిస్తూ వుంటవి.

గదిమధ్యను చిన్నగుండ్రని బల్ల, అల్లికగుడ్డకప్పివుంటుంది, ఎడమ ద్వారం ఇవతల బల్లమీదను గోడనుఆని పెద్ద అద్దం వుంటుంది. అద్దం యెదరనూ పక్కలనూ తలనూ సెంటుసీసాలూ, దువ్వెనా, పౌడరుడబ్బా, హేజ్‌లైన్ స్నో, సెంటుబుడ్లూ, వెండి పళ్ళెంలో ఆకులూ వక్కలూ ఉంటవి. బల్లరెండుమూలలా రెండు గాజుకుక్కలు ఉంటవి. బల్ల మధ్యను అగరువత్తులు పెట్టేది ఉంటుంది. దానిపక్కను ఒక పుస్తకం వుంటుంది. బల్లయెదరను ఒకకుర్చీ ఉంటుంది. ఈ బల్లకు యెదురుగా వున్న గోడను ఆని పేము అల్లికవున్న రోజ్‌వుడ్ కుర్చీలు నాలుగు వరసగా ఉంటవి.

ఎడమవేపు, బల్లఆనిన గోడపైన ప్రఖ్యాత తెలుగు ఫిల్ముతారల పటాలు ఉంటవి. తక్కినగోడలకు ఒకటి రెండు జర్మనుస్త్రీల పాత రకం పటాలూ, రెండుచోట్ల ముజాందారు స్నాన సుందరిపటాలూ ఉంటవి. మంచం అవతలనున్న కిటికీ మీదను శ్రీకృష్ణుడుగోపికల తలల మీది పాలకుండలను తిరగదోస్తువున్న పటం ఉంటుంది.

## నీ లా చ లం

వయసు గ్రహించటం కష్టం. ముసలితనంలో ఉన్నప్పటికీ మనిషిలో జవసత్వాలు తగ్గలేదు. జాగిలంవంటిచూపు; అంటే ఏహృదయాన్నైనా పసిగట్టగల శక్తి ఆసక్తి సహజంగా వున్నదనిపిస్తుంది; ఆడ గొంతుకలో కొంచెం పురుషస్వరం పలుకుతుంది.

## ప్ర ఫు ల్ల

వయస్సు 18. యవ్వనం ప్రతి అవయవంలోనుంచీ పొంచి చూస్తున్నప్పటికీ అమాయకత్వంతో కూడుకున్న పసితనం కొంత ఉన్నదనిపిస్తుంది. గడసరికాదు చొరవగలదనిపిస్తుంది, కాని పక్క పాపిడీ, వాలు జడా, తగుమాత్రమే నగలూ కుసుంబా చీరా, పసుపుపచ్చని జాకెట్టు; మిస మిసలాడుతూవున్న ఆ ఆకారం మాపటుల హృదయాలకు గమ్మత్తు గుస గుసలు కల్పిస్తుంది.

## ప్ర ఫు ల్ల

[బల్లవద్ద కూర్చుని పుస్తకం పేజీలు త్రిప్పుతూ పాడుతూ వుంటుంది]

ఏలనే కోయిలా
ఈవేళ నీగోల,
కోయన్న నీకూత
కోతకోయనె లోనకే?
ననికాని బ్రతుకులో
విసపుమంటలు రేగ...ఏలనే.....
చెలియ యని చేర్చడే
కలనైన కలియడే
పడుచుదనమేలె నీ
వలపు పిలుపేలనే?
ఏలనే కోయిలా...

[బైట మాటలు వినిపించగానే పాట ఆపి లేచి, అటు చూస్తుంది. శ్రీవారు చిరునవ్వుతో ప్రవేశిస్తాడు. ప్రఫుల్ల రెండవద్వారంలోనుంచి పారి పోతుంది]

శ్రీ వా రు

[అలా నిలబడిపోయి, వొచ్చిన ద్వారంవేపు చూస్తూ] అంకమ్మా

అం క మ్మ

[ప్రవేశిస్తూ] బాబు!

శ్రీ వా రు

గాడిదలా అక్కడే నిలబడిపోయావేరా?

అం క మ్మ

[చిరునవ్వుతో] చిత్తం; బాబుగారు అంతఃపురం ఒంటరిగా ప్రవేశించడం మంచిదేమో అని...

శ్రీ వా రు

పడిశావులే...వోరేయ్...ఏమిరా అలా లేడిలా ఎగిరి పారిపోయింది?

అం క మ్మ

తమలాంటి జమీందారులంటే ఏఆడదానికి భయంకాదు బాబూ అందులోనూ...

శ్రీ వా రు

ఛప్, వాగకు...వోరేయ్, కనుక్కోరా!

అం క మ్మ

[శ్రీవారికి సిగరెట్ ఇచ్చి వెలిగించి ఇస్తాడు]

శ్రీ వా రు

[సిగరెట్ కాలుస్తూ. మధ్యమధ్యను మీసం మెలతవేస్తూ, అవతల గుమ్మంకేసి చూస్తుంటాడు. ఇంతలో రెండవవేపు ద్వారంకడ పాట వినిపిస్తుంది; అటు చూస్తారు; మళ్ళీ పాట వెనక పక్కను వినిపిస్తుంది]

ప్ర ఫు ల్లి

[తానుకనపడకుండా అవతలనుంచి పాడుతుంది]

ఏలనే కోయిలా
ఈ వేళ నీగోల
కోయన్న నీకూత
కోతకోయునె లోన!
ససికాని బ్రతుకులో
విసపుమంటలు రేగ!...ఏలనే...
పూలతావులు తాక
తూలిపోవును యెడద
కలలసుకముల రాక
కలవరించును బ్రతుకు!
ఏలనే కోయిలా...

[శ్రీవారు పాటవింటూ, హుషారుగా తాళంవేస్తుంటాడు. అంకమ్మ వొచ్చి పక్కను నిలుస్తాడు]

శ్రీ వా రు

ఏమిరా ఈ ఆలస్యం?

అం క మ్మ

అయ్యో బాబు, వొక్కజంతువు దొరకాలంటే, నట్టడివిలో

తెల్లవార్లూ అలా కాపుకాస్తారే; ఇక్కడ ఈ కాస్తకే తొందర పడిపోతారేం?

శ్రీ వా రు

ఆరి వెధవా, ఆ! మాదగ్గిర ఎవరికైనా భయముంటుంది కాని, మా నౌఖర్లకి మాత్రం ఏజంకూ వుండదు.

అం క మ్మ

ఎలా వుంటుంది బాబూ, మేం లేనిదే తమరు అన్నం భోం చేయలేరు, అంతఃపురం ప్రవేశించలేరు...

శ్రీ వా రు

ఆ !

అం క మ్మ

తమ జమీందారులదగ్గిర పెరిగిన మేం, ఈప్రపంచంలో యెందుకూ పనికిరాం, తమ నౌఖరీలోంచి తీసిపారేస్తే, నీటిలో నుంచి బయటికి విసిరిన చేపలా మాపని రెండునిమిషాల్లో అంతం.

శ్రీ వా రు

ఏడిశావ్, వెధవకబుర్లకేంగాని... చూడరా!

అం క మ్మ

[అటుచూసి]అదిగో...

శ్రీ వా రు

[చూసి, ముఖం ఇటుతిప్పివేస్తాడు]

నీ లా చ లం

[ప్రవేశిస్తూ]నమస్కారాలు, నమస్కారాలు, శ్రీవారికి వెయ్యి నమస్కారాలు! బాబూ, తమలాంటి మహారాజులు

మాయిళ్ళకు ఎందుకు దయచేస్తారు బాబూ— తమలాంటి రాజాధిరాజులు దయచేశారంటే. మాపిల్లలు చేసుకున్న పూర్వజన్మ పుణ్యం ఫలించిందన్నమాట, వాళ్ళు ఈజన్మలో నోచుకున్న నోములు ఊరికే పోలేదన్నమాట...

బాబూ, తమలాంటివారి అనుగ్రహంమాకు కలిగిందంటే, కామధేనువుని దొడ్డిలో పలుపుతాటితో బంధించినట్టుకాదూ; పడకటింటి పట్టెమంచంకింద పెద్దబేంకుపెట్టించుకున్నట్టుకాదూ; [సిగ్గుతో తలవంచి] శ్రీవారు చిత్తగించాలి. బాబూ, నేనూ నావయసులో తమలాంటి ప్రభువుల పోషణలు మెరిగినదాన్నే...

## అంకమ్మ

నీలాచలం, ఇప్పుడు, నీతుప్పుపట్టిన తుక్కు కధంతా ఎందుకూ లోపలకువెళ్ళి...[చేతితో సౌజ్ఞచేస్తూడు, తంపమన్నట్టు]

## నీలాచలం

[అంకమ్మతో] ఉండవయ్యా, ఆ మాత్రం నాకు తెలియక పోలేదు. ప్రభువులకి తగినట్టుగా అలంకరించుకోవొద్దూమరి; ఎటువంటి ప్రభువులు వారు: వారి మెప్పు పొందడం అంటే మాటలా?

[శ్రీవారితో] బాబూ నేనూ నావయసులో నాలుగు ఎస్టేట్లమధ్యా నలిగినదాన్నే...తమ మర్యాదలకి తగినట్టే పిల్లల్ని తయారుచేశాను...మరి అల్లరిచిల్లరి వ్యాపారాలకు...

ప్ర ఫు ల్ల

[లోపలినుంచి] అమ్మా?

నీ లా చ లం

ఆ, వొస్తున్నా ... బాబూ పిల్ల పిలుస్తూవుంది ... ఆలస్యం చేయను బాబూ ... [వెళ్తుంది]

అం క మ్మ

[వెళ్తూవున్న నీలాచలం వైపు చేతులెత్తి, 'ఆని విరగడైందిరా' అన్నట్టు మెట్లు విరుస్తాడు]

శ్రీ వా రు

ఆరి వెధవా? [నవ్వుతాడు]

అం క మ్మ

బాబూ, జ్ఞాపకంవుందీ, కితంసారి మనం పులివేటకు వెళ్లాం ...

శ్రీ వా రు

వెధవా, ఇప్పుడెందుకురా ఆ గొడవ?

అం క మ్మ

చెబ్తా బాబూ; మాటుమీద తెల్లవార్లూ రెప్ప వేయకుండా కూర్చుంటే, పులీలేదు గిలీలేదు, తెల్లవారగట్ల తయారైంది వరదు నక్క ...

శ్రీ వా రు

ఓరి వెధవా ...

అంకమ్మ

పెద్దపులి రాలేదన్న కోపాన్ని ప్రభువువారు తుపాకీతీసి ఆనక్కాని తుక్కుకింద కొట్టేశారు....

శ్రీవారు

[మందహాసంతో] ఐతే ఇప్పుడేమంటావురా?

అంకమ్మ

బాబుగారి సెలవైతే, రెండునల్లీలతుపాకీ దట్టించి, మాటి మాటికీ అడ్డువొస్తూన్న ఈ వరదునక్కా వేశ్యమాతనిపేల్చేస్తా...

శ్రీవారు

[నవ్వుతూ] ఛా, ఊరుకో వెధవా...చూడు, వొస్తూంది [ఏదో ఆలోచనలో వున్నట్టు మీసం మెలివేస్తుంటాడు]

నీలాచలం

[ప్రవేశిస్తుంది; ప్రఫుల్ల లోపలకువొచ్చి గుమ్మం పట్టుకు నిలబడి పోతుంది] రావే, రా, అయ్యో సిగ్గా! [ప్రఫుల్లని చేయి పట్టుకుని తీసుకువొస్తూ...శ్రీవారితో] పిల్లదానికి వల్లమాలిన సిగ్గు బాబూ ...మాకులంలో పుట్టవలసిందికాదు. [ప్రఫుల్లతో] అయ్యో, సిగ్గుపడితే యెలాగే...ఎంత అదృష్టం చేస్తే ఇలాంటి ప్రభువులు మన యింటికి దయచేస్తారు...

ప్రభువువారితో ఏదో ఒకమాటా, ఒక మంతీ, ఒక పాటా, ఒక పదమూ,...అలా...వారి మనసుకి ఒక సంతోషాన్ని కల్పించి, మన విద్యకి ఒక పారితోషికాన్ని సంపాదించి ధన్యత పొందాలి...

కల్పవృక్షం కదిలి మన గడపదాటి గదిలోకి వొస్తే, ఆ కాసింత అవకాశాన్ని కాకుండా చేసుకుంటామటే? రా, ఇలారా; [ప్రఫుల్లని గది మధ్యకు తీసుకువచ్చి] బాబూ, చనువులేక జంకుతూవుంది అంతే...తమకు చెప్పాలిసిందేముంది?...

అంకమ్మ బాబూ, ఇందాక ఏదో అన్నారే, అది అలాగే బాబూ, ప్రభువువారికోర్కె...అయ్యో మా బ్రతుక్కి కోర్కెఏమిటీ ...వారిఆజ్ఞకి మాయింట ఎదురుండదు బాబూ... అంకమ్మ బాబూ, ఒక్కసారి యిలారాండి... సంగతులు మీతో మనవిచేస్తే పీలునుబట్టి మీరే శ్రీవారి చెవిని వేయాలి, రా బాబూ, ఒకసారి ఇలారాండి! [రమ్మని సౌజ్ఞ చేసి వెళ్తుంది]

అంకమ్మ

[చిరునవ్వు నవ్వుతూ శ్రీవారిని కొంటెతనంగా చూసి నీలాచలం కొంత విశ్రమిస్తాడు]

శ్రీవారు

[ప్రఫుల్లనిచూస్తూ] పేరు?

ప్రఫుల్ల

[పైటకొంగు గోళ్ళతో సవరిస్తూ] ప్రఫుల్ల!

శ్రీవారు

మీయమ్మకు పేర్లు పెట్టడంలోకూడా మంచి రసికత వుంది... ప్రఫుల్ల, ప్రభావతి ... చక్కని పేర్లు!

అభినయం సంగీతం వొచ్చునా?

ప్ర ఫు ల్ల

మాలో అవిరెండూ రానివారెవరుంటారండి?

శ్రీ వా రు

ఈమధ్య మీ భోగాలంతా కళావంతులైపోయి కళల్ని కంచె అవతలకు విసిరి పారేస్తున్నారుకదా; మీ కుటుంబం కూడా ఆ తెలివితక్కువ చేశారేమో అని అడిగాం...

నీ లా చ లం

[ప్రవేశిస్తూ] బాగా సెలవిచ్చారు, బాబుగారు ... బాబూ, మాలో మగవాళ్ళని మన్నించి, ఆడదాన్ని అర్ధాన్నం చేస్తే కులంకులం కూలిపోదూ...ఊరికే అన్నాడా బాబూ [పాతరఖంగా పాటరాగంలో] 'కులవిద్యకు సాటిలేదు కువ్వాల చెన్నా' అని...

అ ం క మ్మ

[లోపలనుంచి] నీలాచలం, నీదుంప తెగా?

నీ లా చ లం

అంకమ్మబాబూ; వొస్తున్నా [వెళ్తుంది]

శ్రీ వా రు

ఇందాక పాడింది నీవేనా?

ప్ర ఫు ల్ల

[సిగ్గుతో తలవొంచుకుని] తమరని తెలియక ధైర్యంగా పాడాను.

శ్రీ వా రు

మమ్మల్ని చూసి అంత భయపడనక్కరలేదు. ఏదీ పాడు, ఆ పాటయినాసరే మరొకటయినా సరే!

ప్ర ఫు ల్ల

ఉండండి చాప తెస్తాను [వెళ్ళబోతుంది]

శ్రీ వా రు

[లేచి చేయిపట్టుకుని] చాపెందుకూ, ఇలా రా, ఈ కుర్చీ మీద కూర్చో, ఫరవాలేదు, మేం అంగీకరిస్తున్నాం. చూసేవా రెవరూ లేరు. [కుర్చీమీద కూర్చోబెడతాడు]

ప్ర ఫు ల్ల

[గొంతుక సర్దుకుని పాడుతుంది]

శ్రీ వా రు

[సిగరెట్ వెలిగించి, మధ్యమధ్యను తాళంవేస్తూ వింటుంటాడు]

ప్ర ఫు ల్ల

ప్రేమను మించిన
దేమిటి భువిలో
ప్రణయ మెరుగనీ
బ్రతుకొక బ్రతుకా?
ప్రేమయె కాంతీ
ప్రేమయె శాంతీ
ప్రేమలేనిదే
బ్రతుకొక భ్రాంతీ?...ప్రేమను...

ప్రేమామరశ్రీ
ధామము రా స్త్రీ
ప్రేమ కదపనిదె
కదలదు ధాత్రీ!... ప్రేమను...

[పాట ముగింపులో గుమ్మంవేపు చూస్తుంది అంకమ్మ ప్రవేశిస్తాడు. [ప్రఫుల్లలేచి నిలబడుతుంది]

శ్రీ వా రు

[అంకమ్మతో] చాలా మంచికంఠంరా! [ప్రఫుల్లతో] మీ అక్క ఎక్కడ?

ప్ర ఫు ల్ల

నిజం చెప్పమంటారా?

శ్రీ వా రు

మా దగ్గిర అబద్ధాలెందుకు?

ప్ర ఫు ల్ల

నిజంచెప్తే శ్రీవారికి కోపం వొస్తుందేమో?

అం క మ్మ

చనువైందిగా బాబుగారిదగ్గిర, ఇక భయపడకూ మరి...

ప్ర ఫు ల్ల

[మొలలోనుంచి ఉత్తరం తీస్తూ] ఆఫీసు బంట్రోతు చేత చాటుగా ఈ ఉత్తరం పంపించింది, అక్కయ్య [ఉత్తరం ఈయబోతుంది]

శ్రీ వా రు

ఎందుకూ నీవే చదువు!

అంకమ్మ

చదవడం ఎందుకులే, సంగతులు చెప్పు?

ప్రఫుల్ల

పంతులుగారికి అక్కయ్యమీద అనుమానం కలిగిందట; శ్రీవారితో భీమావ్యాపారం పూర్తి అయ్యేవరకూ ఆ ఆఫీసు నుంచి కదలనీయమని నిర్బంధించి తలుపులు మూయించి వేశారట. మరోక మార్గం కనిపించక రహస్యంగా ఈ ఉత్తరం బంట్రోతు చేత ఇంటికి పంపించింది.

తమరు దయచేస్తారనీ, తమర్ని జాగ్రత్తగా గౌరవించి సంతోషపరచమనీ, తాను ఎలాగైనా తప్పించుకుని వొచ్చేస్తానని రాసింది...

శ్రీవారు

[కోపంతో] ఏకారణంచేత అలా చేశాడు? తనకు ఏ అధికారం వుందని నిర్బంధించాడు?...

ప్రఫుల్ల

నిజం — చెప్తే శ్రీవారికి మరీ కోపం వొస్తుంది.

అంకమ్మ

అడిగాక చెప్పకపోతే బాబుగారికి పట్టరాని కోపం వొస్తుంది.

ప్రఫుల్ల

అయితే చెప్పేస్తాను; అక్కయ్య తమరితో ఏదో మాట్లాడిందని పంతులుగారు అనుమానించారట...

శ్రీ వా రు

[రౌద్రంతో లేచి] ఆ... మేం యెవరని యెంచాడు. ఈ చచ్చు పంతులు; వీడెంత వీడి బ్రతుకెంత. వీడు మమ్మల్ని అను మానించడానికి. వీడిని పాతమార్చి అట్టడుక్కి-తొక్కి- అతఃపా తాళంలోకి నొక్కి- పారేస్తాం... అంకమ్మా లే!... [గుమ్మంవేపు వెళ్ళబోతాడు]

నీ లా చ లం

[ఎదురు వస్తూ] శాంతించాలి బాబూ. మాకు ఆపంతులు మూడువందలు బాకీపడి...

శ్రీ వా రు

అంకమ్మా, తీయ్ నోట్లు. ఈయ్ మూడువందలూ ముసలిదానికి వెంటనే ... [ఇటువైపు తిరిగి] వీడిని క్షమించం.

నీ లా చ లం

[అంకమ్మ ఇచ్చిననోట్లు అందుకుంటూ] శ్రీవారి దయ... బాబూ...

శ్రీ వా రు

[గోడవైపు తిరిగిపోయి] మాకు కోపంగా వుంది... మాతో ఎవ్వరూ మాట్లాడవొద్దు... ప్రఫుల్లా వెళ్ళు, లోపలికి వెళ్ళు... నీలాచలం, నీవుకూడా... అంకమ్మా. రా చెబ్దాం వీడి సంగతి [గుమ్మంవైపు చరచరా వెళ్తాడు]

ప్ర భా వ తి

[ఎదురు వచ్చి ఆయన గుండెలకు తగులుతుంది]

శ్రీ వా రు

[ఆశ్చర్యంతో ఒక అడుగు వెనుకకు వేస్తాడు]

ప్ర భా వ తి

హుజ్ అబ్బా [తూలి శ్రీవారి చేయిపట్టుకుని] దయచేశారా! ధన్యురాలిని నా శ్రమ తీరిపోయింది... దయచేయండి, కూర్చోండి

శ్రీ వా రు

నీకు ఏం ప్రమాదం కలగలేదుకదా?

ప్ర భా వ తి

తమ దయవుండగా నాకు ప్రమాదమా?... ఎప్పుడూ వుండదు.

శ్రీ వా రు

[కూర్చుంటూ] మాకు చాలా కోపం వొచ్చింది... నీరాక వల్ల కొంత తగ్గింది!

నీ లా చ లం

నీమీద ఎంతదయో ప్రభువువారికి! నీ ఉత్తరం చూసి, ప్రళయకాల రుద్రుడైపోయి... ఆ పంతులమీద...

శ్రీ వా రు

నీలాచలం, ఆ దౌర్భాగ్యుడి పేరెత్తకు మాదగ్గిర... మాకు కోపం పూర్తిగా పోలేదు.

అ ం క మ్మ

నీలాచలం, నీవు లోపలికిపద.

ప్ర భా వ తి

అమ్మా, నీవు వెళ్ళి ప్రభువువారికి ఫలహారాలూ కాఫీ...

శ్రీ వా రు

ఇప్పుడేమీ వొద్దు...

ప్ర భా వ తి

[చనువుగా చేతిమీద చేయివేసి] ప్రభువువారికి నావల్ల చాలా శ్రమకలిగింది, క్షమించాలి!

శ్రీ వా రు

నిజమే, కాని...ఇక ఫరవాలేదు.

ప్ర భా వ తి

ప్రఫుల్లా! చూడు, ముఖం కడుక్కోడానికి సబ్బూ, నీళ్ళూ పెట్టించు.

ప్ర ఫు ల్ల

[వెళ్తుంది]

ప్ర భా వ తి

అలిసివొచ్చాను...ప్రభువువారి సెలవైతే, రెండు నిమిషాలు...

శ్రీ వా రు

వెళ్ళు, ముఖం కడుక్కుని రా! ఇంతలో నా క్రోధం కూడా తగ్గుతుంది...

ప్ర భా వ తి

చిత్తం [వెళ్తుంది]

శ్రీ వా రు

అంకమ్మా!

అంకమ్మ

బాబూ!

శ్రీ వా రు

పంతులు దరిద్రపు ముండాకొడుకు వెధవరా!

అంకమ్మ

ఇంకొనెమ్మదిగా అంటారు బాబుగారు... దరిద్రగొట్టు—దౌర్భాగ్య దామోదర— వెధవన్నర వెధవ!

శ్రీ వా రు

[మందహాసంతో] బాగా అన్నావురా... ఏదీ సిగరెట్టు!

అంకమ్మ

[సిగరెట్ ఇచ్చి, అగ్గిపుల్లగీసి వెలిగించి, బల్లదగ్గరగావెళ్ళి పుస్తకం తీసిచూసి నవ్వుతాడు]

శ్రీ వా రు

[పొగవొదులుస్తూ, అంకమ్మనుచూసి] నవ్వుతున్నావ్, ఏం పుస్తకంరా అది?

అంకమ్మ

బాబుగారు చూడవలసిందే!

శ్రీ వా రు

వెళ్ళేటప్పుడు జ్ఞాపకంచెయ్యి, తీసుకువెళ్తాం.

అంకమ్మ

[పుస్తకంలోనుంచి ఒకఉత్తరంతీసి, పైకి లోలోపల చదువుకుంటూ] ఆరి, వెధవా...

శ్రీవారు

ఏంరా? ఏంఉత్తరంఅది?

అంకమ్మ

ఆ పంతులు వెధవ రాసిందే... బాబుగారు చూసి తీరాలి; జేబులో పెడతాను...

శ్రీవారు

ఛీ వెధవా, తప్పురా?...

అంకమ్మ

అలాకాదు బాబూ, తమరు యిదిచిత్తగించి తీరాలి, తప్పదు...మనల్ని గురించేవుంది.

శ్రీవారు

ఆ,అలాగా! అయితే ఆపుస్తకంలోనే వుంచేయ్ చెప్తా... ఇలారా!

అంకమ్మ

[ఈఉత్తరం పుస్తకంలోపెట్టి, దాన్ని బల్లమీదవుంచి, శ్రీవారి వద్దకు వొస్తాడు]

శ్రీవారు

అంకమ్మా, ఈపంతులుగాడికి తగినబుద్ధి చెప్పాలి...

అంకమ్మ

చెప్పితీరాలి బాబూ...తమరి సెలవైతే, నేనూ రజాక్ షైల్మానూ

శ్రీవారు

ఛా, అలాకాదు...ఉండు ఆలోచించుదాం...ప్రభావతి బుద్ధి చాలా చురుకైందిరా!

అంకమ్మ

అమ్మా, ఆవంశమే అలాంటిది బాబూ!

శ్రీవారు

[తలపైకెత్తి ఆలోచించి] వోరేయ్! ఆలోచించాంరా... పద్ధతి

ప్రభావతి

[ప్రవేశిస్తూ] ప్రభువువారు క్షమించాలి ఆలస్యానికి!

శ్రీవారు

[లేచి] ఫరవాలేదు...ప్రభావతీ చూడూ, ఆ పంతులు పని పట్టిస్తాం...

ప్రభావతి

మనిషి దుర్మార్గుడుకాదు, కాని డబ్బు ఇబ్బందులవల్ల అవకతవకలలో పడిపోతున్నాడు...

శ్రీవారు

అదంతా లాభంలేదు. వాడిని క్షమించం...

ప్ర భా వ తి

శ్రీవారికి శ్రమ అక్కరలేదు; నాకు జరిగిన పరాభవానికి నేను కసితీర్చుకోలేకపోను...

శ్రీ వా రు

అవసరంలేదు. మేం ఆలోచించాం... అంకమ్మ మమ్మల్ని దిగబెట్టి తిరిగి వొస్తాడు... వాడు చెప్తాడు మా ఆలోచన... నీవూ ఆలోచించు... మేం సెలవిచ్చినట్లు మీరు చెయ్యాలి... తప్పదు... మాకు స్నానానికి వేళయింది... [వెళ్ళబోతాడు]

ప్ర భా వ తి

దయచేసి కొంచం ఆగండి [అటుతిరిగి] ప్రఫుల్లా!

ప్ర ఫు ల్ల

[ప్రవేశిస్తుంది]

ప్ర భా వ తి

ప్రభువులు దయచేస్తున్నారు. సెలవుతీసికో!

ప్ర ఫుల్ల, ప్ర భా వ తి

నమస్కారం...

శ్రీ వా రు

అంకమ్మా, రారా!

అం క మ్మ

[పుస్తకం చూపిస్తాడు]

శ్రీ వా రు

ప్రభావతీ, ఏంపుస్తకం అది ?

ప్ర భా వ తి

తమరు చూడవలసిందే; ఇదివరలో చూసి ఉండకపోతే; తీసుకువెళ్ళి చూడండి;

శ్రీ వా రు

మంచిది. అంకమ్మా, ఆ పుస్తకం తీయరా! సరి, మేం ఉంటాం...

నీ లా చ లం

[ప్రవేశిస్తూ] ప్రభువులు దయచేస్తున్నారా? నమస్కారాలు బాబూ...ఇక తమదయ...తమవాళ్ళం...

శ్రీ వా రు

అలాగే, ఉండండి! [అంకమ్మ, శ్రీవారూ వెళ్తారు. ప్రఫుల్ల ప్రభావతి వెంట వెళ్తారు]

నీ లా చ లం

[నోట్లు లెక్క పెడుతూవుంటుంది. బైట మోటారుకార్ బయలు దేరిన చప్పుడు వినిపిస్తుంది]

ప్ర ఫు ల్ల

[అవతలనుంచి హుషార్‌గా పాడుతూ అడుగులువేస్తూ వొస్తుంది]

నచ్చారే, శ్రీవారూ,
నా మనసుకు యెంతో నచ్చారూ!

నీ లా చ లం

[నోట్లు చేతిలో పట్టుకుని నవ్వుతూ చూస్తుంది]

ప్ర ఫు ల్ల

[ప్రవేశించి]

నచ్చారే, శ్రీవారూ,
నా మనసుకు యెంతో నచ్చారూ!

[గిర్రుమని తిరుగుతుంది]

నీ లా చ లం

[నోట్లు చూపిస్తూ]

ఇచ్చారే శ్రీవారూ,
ఇంటికి ఖర్చులు యిచ్చారూ.

[ప్రఫుల్ల చేతులు పట్టుకొని తానూ తిరుగుతుంది]

ప్ర భా వ తి

[ప్రవేశిస్తూ]

చచ్చాడే ఈనాడూ,
చప్పగ పంతులు చచ్చాడూ।

[ఇద్దరిమధ్యా నిలుస్తుంది. ముగ్గురూ చేతులుపట్టి ఊగుతూ]

ప్ర ఫు ల్లి

నచ్చారే శ్రీవారూ,
నా మనసుకు యెంతో నచ్చారూ!

నీ లా చ లం

ఇచ్చారే శ్రీవారూ,
ఇంటికి ఖర్చులు ఇచ్చారూ!

ప్ర భా వ తి

చచ్చాడే ఈనాడూ,
చప్పగ పంతులు చచ్చాడూ!

ప్ర ఫు ల్లి

నచ్చారే శ్రీవారూ,

నీ లా చ లం

ఇచ్చారే శ్రీవారూ

ప్ర భా వ తి

చచ్చాడే ఈనాడూ.

[మధ్యను తల్లీ, కుమార్తెలు ఇరుపక్కలానిల్చి తలలూపుతూ, ముగ్గురూ ఒకరి తరువాత ఒకరు]

నచ్చారే...ఇచ్చారే...చచ్చాడే...

తెర తొందరగా



# 4

శ్రీవారి బంగాళా ముందరభాగంలోని హాలు. రెండువేపులా నిడివి పాటి తెల్ల స్తంభాల వరసలు. ఎదరభాగంలో దూరంగా అడ్డుగోడ. గోడ మధ్యన కోడిగుడ్డు ఆకారంవున్న ద్వారం ఉంటుంది. హాలు ఎదరభాగంలో గుండ్రటిబల్ల తెల్లగుడ్డ కప్పివుంటుంది. బల్లచుట్టూ చక్కని కుర్చీలు ఉంటవి, బల్లపైన 'టీపాట్' సాసర్లూ, కప్పులూ, ఫలహారాలున్న పళ్ళేలూ, చిన్న ప్లేట్లూ ఏర్పాటుచేసి ఉంటవి. హాలు అంతటా చక్కని జంపఖానా పరచివుంటుంది. రాజాపాలెయం కుక్క మాటిమాటికీ అటూ ఇటూ తిరుగుతూ వుంటుంది.

[అంకమ్మ బల్లమీది కప్పులు సర్దుతూ పాడుతూంటాడు]

టీ... దీనిలోని మజా ఏమిటీ!
అలసట తీరుటా
కవసర మీా టీ,
నిదుర బాపుటా
కిది పరిపాటీ... టీ... దీనిలోని కిటుకేమిటీ!
కలల నల్లుటా
కిదియే సాటీ,

కథలు నడుపుటా
కిది ఘనపాఠీ...టీ...దీని సాటీ మరి యేమిటీ!
కవితకు ధాటీ
కల్పన కీ టీ
కవులపాలిటీ
కల్పతరువు టీ...టీ...దీనిలోనీ మజా యేమిటీ!

[ఇంతలో బైటుచప్పుడు విని, అవతలకు వెళ్లిపోస్తాడు. వెంటనే పిళ్ళె ముఖ్యప్రాణరావు ప్రవేశిస్తారు. పిళ్ళె గూడకట్టూ, పొట్టిచేతులచొక్కా జరీ పైకి వచ్చేటట్టుగా ఇస్త్రీమడతలున్న కండువాతోనూ వుంటాడు]

అంకమ్మ

దయచేయండి, దయచేయండి. రాజావారు లోపల స్నేహితులతో మాట్లాడుతున్నారు. త్వరలోనే దయచేస్తారు.

పిళ్ళె

అవసరమిల్లెప్పా, అవసరమిల్లె... మేముదా కూసుంటుమప్పా, కూసుంటుము. ముక్కిప్పేనరావూ, కార్డు తెస్తివా?

రావు

[జేబు తడిమిచూసి] తేలేదు సార్.

పిళ్ళె

చచ్చచచ్చచా, ఎట్టీ వేబారం సేస్తువబ్బా ... నువ్వు యూజ్ లెస్ ఇయ్యా యూజ్ లెస్ వేబారానికి ...

రావు

తొందరపడకండిసార్, శ్రీవారికి మనరాక తెలుసును; అవసరం లేదు.

అంకమ్మ

పిళ్ళైగారూ, కార్డు అక్కరలేదండి . . . మీరు వొస్తారని రాజావారికి తెలుసును, అందుకనే నన్ను ఇదంతా సిద్ధంచేయ మని సెలవైంది.

పిళ్ళై

వో, తెలుసునా! శరిశరిశరి; అట్లదా అబ్బా, అట్లదా...

రావు

కూర్చోండి పిళ్ళైగారూ....ఇలా దయచేయండి

పిళ్ళై

వో, కూసుంటుము, కూసుంటుము [కూర్చుంటాడు]

రావు

చూడూ! అంకమ్మనాయుడూ, శ్రీవారికి శాస్త్ర మనవి చేయించు.

అంకమ్మ

అవసరం లేదండి; శ్రీవారు త్వరలోనే దయచేస్తారు.

పిళ్ళై

ఆమ, ఆమ, ఆమ అవసరపడాదే ముక్కి-ప్పేసరావూ, అవసరపడాదే ...ఇరబ్బా, ఇరు!

రావు

అంకమ్మ నాయుడూ, రాజావారు సంతోషంగానే వున్నారా?

అం క మ్మ

లేదు, చిరాగ్గా వున్నారు.....రాజావారి మనసు బాగున్నట్టులేదు, ఇందాక అనవసరంగా కుక్కని కమ్చీతో బాది పారేశారు. ఆకోపం తీరక చిన్న తప్పుకే ఇద్దరు నౌకర్లని దేవిడీమన్నా చేశారు.

పి ళ్ళె

["దేవిడీమన్నా" కు అర్థం తెలియక ముఖ్యప్రాణరావుతో] ఎన్నా అదీ?

రా వు

పిళ్ళెగారూ, మనం రేపు వొస్తే మంచిది. రాండి వెళ్దాం [లేస్తాడు]

పి ళ్ళె

[లేవకుండానే] ఎన్నా అవసరమయ్యా నీకుమ్మా ఇరయ్యా ...[జల్లమీది కప్పులు చూపిస్తూ] ఇది యెల్లాం సూస్తువే... ఉక్కారబ్బా; ఉక్కారు...

అం క మ్మ

[గుమ్మంలోపలికి చూస్తూ] రాజావారు దయచేస్తున్నారు.

శ్రీ వా రు

[చేతిలో ఒక 'హంటర్' కొరడా పట్టుకుని ప్రవేశిస్తాడు]

రా వు

[కొరడా చూసి, వెలవెలబోతాడు]

పి ళ్ళె

[హడావిడిగా లేస్తూ] గుడీవినింగ్, గుడీవినింగ్, గుడీవినింగ్ రాజావారూ [శ్రీవారికి ఎదురు వెళ్ళి 'షేక్‌హేండ్' చేస్తాడు]

శ్రీ వా రు

[చేయి అందిస్తూ] గుడ్ ఈవినింగ్...పిళ్ళైగారూ అలా దయచేయండి [కుర్చీ చూపిస్తాడు]

రా వు

[నమస్కారిస్తాడు]

శ్రీ వా రు

[నమస్కారం అందుకుని] కూర్చోండి పంతులుగారు [పెద్ద కుర్చీలో కూర్చుంటాడు]

అం క మ్మ

[అవతలికి వెళ్తాడు]

పి ళ్లై

[నాలుగువైపులా ఇంటిని పరకాయించిచూచి] రాజావారూ, నిండా బ్యూటిఫుల్ పేలేస్ సార్...

శ్రీ వా రు

[నవ్వే ఆపుకుంటూ] ఈవూరు ఖులాసాకి వొచ్చినప్పుడు ఉండడానికి కట్టించిన బంగాళా యిది. మాకోట కళ్యాణపురం లోవుంది.

పి ళ్ళై

ఓ, ఫోర్ట్. ఫోర్ట్, ఇరుకా! వో సూస్తుము సార్; మన గోటదా సూడాల్సింది!

రా వు

మన వ్యాపారం పూర్తి అయినతరువాత పిళ్లైగారు కల్యాణపురంవెళ్ళి శ్రీవారికోట తప్పకుండా చూడాలి.

శ్రీ వా రు

పిళ్ళైగారూ, మీరు చూడవలెనంటే రేపు దయచేయండి; మేం ఏర్పాటులు చేయిస్తాం...

పి ళ్ళై

థేంక్స్, థేంక్స్, నిండా థేంక్స్...సూస్తుము సార్, అవశ్యం సూస్తుము సార్ మన ఫోర్ట్.

రా వు

[సంచిలోనుంచి, కాగితాలు తీస్తూ] శ్రీవారు చిత్తగిస్తే, ఈ ప్రపోజల్ ఫారమ్, పూర్తిచేసి...

శ్రీ వా రు

తొందరపడకండి; ఆగండి...

పి ళ్ళై

ఎన్నా అవసరం ముక్కెప్పేనరావూ, శుమ్మా పేస్టు. [తలతో సాంజ్ఞచేస్తాడు 'ఊరుకో' అని]

శ్రీ వా రు

వోరే, అంకమ్మా!

అం క మ్మ

[ప్రవేశిస్తూ] బాబు.

శ్రీ వా రు

వోరేయ్: ఆపుస్తకం తీసుకురా!

అంకమ్మ

మనం ఇందాక వాళ్ళ యింటిలోనుంచి తెచ్చిన పుస్తక మేనా బాబు?

శ్రీవారు

అదేరా, వెధవా; పో తీసుకురా!

అంకమ్మ

చిత్తం బాబు [వెళ్తాడు]

రావు

ఒక ముఖ్యవిషయం తమతో మనవిచేయాలి సార్. కంపెనీ వ్యాపారానికి ఇది సంవత్సరాంతం ఇక కొత్త సంవత్సరం ప్రారంభమౌతుంది. తమ ఇన్‌స్యూరెన్సు ఈదినం పూర్తి అయితే, ఈ సంవత్సరం లాభాల పంపకం తమ పోలసీకికూడా చెందుతవి.

పిళ్ళె

ముక్కప్పేనరావూ, రాజావారికి యెల్లాం బిజినెస్ తెలుసబ్బా...

శ్రీవారు

పంతులుగారూ, తొందరపడకండి, మాకు ఈ వ్యాపార విషయమంతా తెలిసింది...మీపని తొందరగానే పూర్తిచేయిస్తాం; అన్ని యేర్పాటులూ చేయించే వుంచాం.

పిళ్ళె

[ముఖ్యప్రాణరావుతో] ఎన్నాయ్యా, నాన్ సొల్లిల్లె? నాన్ సొత్తినే, నూ స్తివా!

### రావు

[శ్రీవారితో] థేంక్స్ సార్!

### శ్రీవారు

పిళ్లైగారు రావడంవల్లను మాకు ఈవ్యాపార రహస్యాలు బాగా వెల్లడయినవి.

### పిళ్ళై

[శ్రీవారితో] థేంక్స్ సార్, థేంక్స్, నిండా థేంక్స్...
[ముఖ్యప్రాణరావుతో] ఎన్నాయ్యా గమనిస్తివా రాజావారి వేబారలచ్చనం? అద్దాప్పా నాన్ సొల్రదు!

### శ్రీవారు

[కొంటెతనంగా నవ్వుతూ] అంకమ్మా!

### అంకమ్మ

బాబు [ప్రవేశించి, ప్రభావతి యింటినుంచి తెచ్చిన పుస్తకాన్ని బల్లమీద శ్రీవారి ముందరను పెడతాడు.

### రావు

[ఆ పుస్తకాన్ని తేరిపార చూసి, ముఖం వేలాడవేస్తాడు]

### పిళ్ళై

[అర్థంలేని ఉత్సాహంతో] ఎన్నా బుస్తగం సార్ అది?

### శ్రీవారు

[మందహాసంతో] పిళ్ళైగారూ, తమరికి తెలుగు బాగా

తెలియదు. ఇది చాలా పెద్దగ్రంథం. దీని విశేషం...బహుశా పంతులుగారికి తెలిసి వుంటుంది.

రా వు

[మోహం బాలబాపచిన్నవొచ్చిన శిశువులా నిర్జీవమైపోయి, తల చేతితో పట్టుకొని] తెలియదండి ఎక్కడా చూసినట్టుకూడా జ్ఞాపకంలేదు.

పి ళ్ళై

[ముఖ్యప్రాణరావు వైఖరి తెల్లబోయిచూసి] ఎన్నాయ్యా, ఎన్నా అక్షీ అయిపూడుస్తువు?

శ్రీ వా రు

పంతులుగారూ, ఏమిా, మీారు అదోమోస్తరుగా వున్నారు?

రా వు

[పెద్ద నిట్టూర్పు వొదిలి] కొంచం తల తిరుగుతూవుంది... పైత్యం చేసినట్టుంది...

పి ళ్ళై

ఎన్నా తల నొప్పుదా?

శ్రీ వా రు

అంకమ్మా!

అ ం క మ్మ

బాబు.

శ్రీ వా రు

చూడూ. పంతులుగారి వెనకను నిలబడి, కదిలితేవారిని గట్టిగా పట్టుకో! జాగ్రత్త!!

అం క మ్మ

[ముఖ్యప్రాణరావు వెనకను నిలబడి, చొక్కా చేతులు పైకి యెత్తుతాడు]

పి ళ్ళై

[అంకమ్మతో] బద్రమప్పా... కడిపూడుస్తుడు!

శ్రీ వా రు

ఈవిధమైన తలతురుగుడికి మావద్ద చాలా మంచి విరుగుళ్లు ఉన్నవి; ఉండండి తగిన చికిత్స చేయిస్తాం!

పి ళ్ళై

మెడిసనా? రాజావారూ తెప్పించేద్దానే మెడిసన్!
[రావు లేవబోతాడు. అంకమ్మ కళ్ళెరజేస్తాడు]

రా వు

[సద్దుకుని] శ్రీవారు, క్షమించాలి... నాకు చాలా వికారంగా వుంది... ఈ వ్యాపారం పిళ్లైగారు చూస్తారు... నాకు దయచేసి సెలవు యిప్పించమని నా ప్రార్థన!

శ్రీ వా రు

[కఠినంగా] వీల్లేదు; కూర్చోండి. ఈ పైత్యవికారం మావద్ద అట్టేసేపు వుండదు. త్వరలోనే తగ్గుతుంది... [అంకమ్మతో] అంకమ్మా, ఏర్పాటులన్నీ చేశావురా? అంతా సిద్ధంగావున్నటేనా?

అం క మ్మ

తమ ఆజ్ఞప్రకారం అందరూ సిద్ధంబాబూ! రజాక్ షైల్ మాన్ కూడా ప్రక్కనే వున్నాడు...తమరు ఎప్పుడు సౌంజ్ఞ చేస్తే...

పి ళ్ళై

[అమాయికంగా] ఎన్నాసార్, రాజావారూ, సౌంజ్ఞ ఎంతుకు...

శ్రీ వా రు

[గుమ్మంవైపు చూస్తూ] వో రేయ్ రౌద్రం

రౌ ద్ర ం

[ప్రవేశిస్తూ] బాబు

శ్రీ వా రు

[తీవ్రంగా] నీవు ఆ పిళ్లెగారి వెనకను నిలబడు... తెలిసిందా జాగ్రత్త!

రౌ ద్ర ం

[చిత్తంబాబు పిళ్ళై వెనకను నిలబడి, చొక్కా చేతులు పైకెత్తి, అంకమ్మకేసి కన్నుగీటుతాడు]

పి ళ్ళై

[బిక్క మొహంతో, దెబ్బలుతిన్న కుక్కలు పిల్లవాడులా అయిపోయి, ముఖ్యప్రాణరావుని చూసి మండిపడతాడు; పెదవులు అల్లల్లాడుతవి కాని మాటరాదు]

శ్రీ వా రు

[లేస్తూ] పిళ్లైగారూ, తమరు ఏమీ అనుకోకండి; మీరు మాకు స్నేహితులు. ఈ వ్యవహారం మేం నిశ్చయించిన

ప్రకారం పంతులుతో సెటిల్మెంటు వేస్తాం; తమరు అలాగే కూర్చోండి.

పి ళ్ళై

[జంకుతూ చిరునవ్వు నవ్వి, బిగిసిన గొంతుకతో] థేంక్సు సార్, థేంక్సు, నిండా థేంక్సు... దమ యిష్టండా సార్!

శ్రీ వా రు

[నౌఖర్ల కిద్దరికీ "జాగ్రత్త" అన్నట్లు సౌంజ్ఞచేసి వెళతారు]

పి ళ్ళై

[శ్రీవారు వెళ్ళేవరకూ ఆగి కనిపెట్టి, కోపంతో చేయిచాపి] ఎన్నా, కళిదే వ్యాబారం...

రౌ ద్రం

[పిళ్ళై చేతిని కిందకు దింపి, జాగ్రత్త అన్నట్టు సౌంజ్ఞ చేస్తాడు]

పి ళ్ళై

[గప్‌చిప్, రావు తలయెత్తుతాడు అంకమ్మ ఆతల తిప్పి మొదటి పద్ధతిలో పెడతాడు]

శ్రీ వా రు

[తిరిగి ప్రవేశిస్తాడు; ఒకపక్క ప్రభావతి రెండవపక్క ప్రఫుల్ల వుంటారు. రావు ఆ దృశ్యం చూసి నిర్విణ్ణుడైపోతాడు. పిళ్ళై తెల్లబోయి తెలబోతాడు. రౌద్రం పిళ్ళైని దభాయించి చూస్తాడు. పిళ్ళై రౌద్రాన్ని చూసి జంకి బెదురుతుంటాడు. శ్రీవారు, ప్రభావతి, ప్రఫుల్లలతో బల్లవద్దకువచ్చి] అంకమ్మా జాగ్రత్త!

అం క మ్మ

సిద్ధం బాబూ!

శ్రీ వా రు

పంతులుగారూ, వీళ్లు ఈ వూరిలో ప్రఖ్యాత వేశ్య కుటుంబానికి చెందిన స్నేహితులు. వీళ్ళని మీరు ఎరిగివుండడానికి అవకాశంలేదు. మా పోషణలో వున్నారు...

చక్కని స్త్రీ రత్నాలుంటేనే కాని ఏవ్యవహారమూ రక్తికట్టదుకదా అని, పార్టీ పూర్తికావడానికి వీళ్ళని మేం పిలిపించాం.

[ప్రభావతి (ప్రఫుల్లలతో] కూర్చోవచ్చు [శ్రీవారు ముందూ తరువాతను వాళ్ళూ కూర్చుంటారు. (ప్రభావతితో] వారు భీమా ఇన్‌స్పెక్టర్ అడయిక్కలప్ప పిళ్ళైగారు.

ప్ర భా వ తి

[నమస్కరిస్తుంది]

పి ళ్ళై

[తిరిగి నమస్కరిస్తూ] సంతోషం,సంతోషం, పెరబావదీ.

శ్రీ వా రు

పిళ్ళైగారూ, మీరుపొరబాటు పడుతున్నారు. పంతులుగారి ఆఫీసులో టైపిస్టుగా వున్న ప్రభావతికీ, ఈమనిషికీ చాలా దగ్గర పోలిక వుంది; అందుచేతనే మేంకూడా పొరబాటుపడి పోయాం. ఆ ప్రభావతి మద్రాసుమనిషికదా! పోలికలో ఒక్కలాగే వున్నప్పటికీ మనుష్యులు వేరు.

పి ళ్ళై

ఆమాసార్. ఆమ! సరియా రిజెంబ్లెన్స్ ఇరుకుసార్! అద్దానాన్ సూస్తును... వుండునుసార్, ఇందమాదిరి క్లోజ్ రిజెంబ్లెన్స్, వుండును!

శ్రీ వా రు

[ప్రభావతి. ప్రఫుల్లలతో] వారినిమీరు చూసివుండడానికి అవకాశంలేదు. అయినా ఎక్కడైనా చూసిన జ్ఞాపకం వున్నదా?

ప్ర భా వ తి

తెలియదండి, ఎక్కడా చూసిన జ్ఞాపకంకూడాలేదు. ఎవరండీ వారు?

శ్రీ వా రు

వారు ముఖ్యప్రాణరావుగారు! భీమాఏంజెంటు; అమెరికా పద్ధతులను ప్రవేశపెట్టి మనదేశంలో కొత్తరకంగా వ్యాపారం నడిపిస్తున్నారు.

ప్ర భా వ తి

అమెరికా పద్ధతులు ఏమిటండీ?

శ్రీ వా రు

ఇంటిపట్టునివుండే ఆడవాళ్ళు మీకు... అటువంటివి తెలియవు.

ప్ర ఫు ల్ల

పిళ్ళేగారు కూడా అమెరికా పద్ధతులవారేనా?

శ్రీ వా రు

కంపెనీ ఒకటేకాని, వారిపద్ధతులు వేరనుకుంటాను.

పి ళ్ళై

ఆమా, ఆమా, ఆమా, సార్! ఎనకు అంద అమెరిగా బద్ధతులు తెరియాదుసార్!

రా వు

[నఖించచ్చి] నాకు వొంట్లో ఏమీ బాగుండలేదు... తమసెలవైతే...

శ్రీ వా రు

వీల్లేదు, మీవొంటికి భయంలేదు: కొంచెంఆగండి; వ్యవహారం పూర్తిచేస్తాం...వొరేయ్‌చూడూ...

అం క మ్మ

[కదిలి తొస్తాడు]

శ్రీ వా రు

[కొళ్ళుగ్రజేస్తూ] గాడిదా, బుద్ధిలేదూ? ఏం [ కొరడామీద చేయివేసి ] కొరడాదెబ్బలు కావాలా? నీపని నీవుచూడు ఖబడ్దార్!

అం క మ్మ

[ముఖ్యప్రాణరావు పనకళ పర్దుతుంటూ] చిత్తం, చిత్తం, పొరబాటు బాబూ: రజాక్ ఫైల్‌మాన్ కనిపెట్టి వున్నాడు గదా ఫరవాలేదని...

శ్రీ వా రు

నోర్‌ముయ్, ఎవరిపనులు వారికి బెత్తాయించాం... మాకు తెలియదనుకున్నావ్... వొరేయ్ రౌద్రం చూడూ... ఇలారా!

రౌ ద్రం

[కదలకుండా] బాబు...మరి ఇక్కడ...

శ్రీ వా రు

అవసరంలేదు; పిళ్ళైగారికి తలతిరగడంలేదు నీవు రా !

పి ళ్ళై

ఆమా సార్, ఆమ! రాజావారూ, ఎనకు పైత్తెం యిల్లె సార్, థేంక్స్ సార్, థేంక్స్ !

[రాంద్రం శ్రీవారి దగ్గరకు వొస్తాడు]

శ్రీ వా రు

[రాద్రంతో] వొరేయ్ చూడూ, గుమాస్తా దగ్గరకు వెళ్ళి భీమాకోసం తీసివుంచమన్న – మొత్తం పట్టుకురా!... ఆగాగు... పంతులుగారూ, కట్టవలసిన ప్రీమియం ఎంతన్నారు ?

రా వు

[కొంచెం సర్దుకుని] చిత్తం, అర్ధసంవత్సరానికయితే అయిదు వందలు.

పి ళ్ళై

ముక్కప్పేనరావ్రూ, సరియా చూసేద్దానే; ఎన్నాయ్యా ఇది ?

శ్రీ వా రు

పిళ్లెగారూ, ఫరవాలేదు, తమరు ఊరుకోండి !

పి ళ్ళై

ఆల్ రైట్ సార్! దమ యిష్టంధా మన యిష్టం... [ముఖ్యప్రాణరావుని చూచినూ పళ్ళు గిట్టకరిచి] ఇది శుమ్మా తొడప కట్టై, చీంపురుకట్టై ఫేబారం-స్సార్ ....

శ్రీ వా రు

[నవ్వుతూ] ఫరవాలేదు. అది మేం సర్దిస్తాం. రౌద్రం, చూడూ, సెలవైందని గుమాస్తాతో చెప్పి భీమానిమిత్తం అయిదువందలు పద్దురాయించి పట్టుకురా :

రౌ ద్ర ం

చిత్తంబాబు[వెళ్తాడు. రావు “ఉస్సమ్మ గుర్రా” అన్నట్టు నిట్టూర్పు వదులుతాడు. పిళ్ళై హుషార్‌గా కాళ్ళు ఊపుతూ, బల్లమీద చేతితో తాళం వేస్తుంటాడు]

శ్రీ వా రు

[ప్రభావతితో] ఈ భీమాగురించి నీ అభిప్రాయం ఏమిటి?

ప్ర భా వ తి

ఆఫీసులో తిరిగే ఆమగరాయడు ప్రభావతివంటి వాళ్ళకి గాని, ఇంటిపట్టుని తమ అధీనంలోవుండే ఆడదాన్ని నాకేం తెలుసునండీ ఇటువంటి వ్యాపారాల సంగతి ?

శ్రీ వా రు

ప్రఫుల్లా, నీ అభిప్రాయం ఏమిటి ?

ప్ర ఫు ల్ల

హుజూర్ వారు చివరవరకూ డబ్బుకట్టే యేర్పాటులు చేయిస్తే, నేను భీమా చేస్తాను.

పి ళ్ళై

రైట్టు, రైట్టు, రైట్టు... నల్లా యోజనమనిసి సార్ పెరిప్రుల్ల!

శ్రీ వా రు

పంతులుగారూ, మీ అభిప్రాయం ఏమిటి?

రా వు

క్షమించాలి శ్రీవారు, నామెదడు పనిచేయడంలేదు. ఈ వ్యాపారం తమరు ఎలాగో నిర్ణయం చేసివేసి త్వరలో నేను వెళ్ళడానికి సెలవిప్పించమని నామనవి... నాకు వొంట్లోకూడా బాగున్నట్టులేదు. అనుగ్రహిస్తే నేను ఇంటికి వెళ్తాను...

పి ళ్ళై

ఎన్నా అవసరమప్పా; నీ శుమ్మాఇరు... పెరబావదీ...

శ్రీ వా రు

పిళ్ళైగారూ, ఈ మనిషి ప్రభావతికాదు.

పి ళ్ళై

ఆమా, ఆమా, ఆమాసార్; మిస్టేక్, మిస్టేక్, మిస్టేక్ సార్; మరిచి పూడిస్తిని రిజెబ్బెన్స... [రౌద్రం నోట్లుతెచ్చి శ్రీవారియెదరను బల్లమీద పెడతాడు]

శ్రీ. వా

[నోట్లు పిళ్ళైవేపు తోస్తూ] పి గారూ కొంచం లెక్క పెట్టండి!

పి ళ్ళై

పెటుతునుసార్: వో పెటుతును [నోట్లు లెక్కపెడు తుంటాడు]

శ్రీవారు

[పుస్తకం ప్రభావతియొదరకు తోస్తాడు. ప్రభావతి పుస్తకాన్ని తీసి పేజీలు తిప్పుతూవుంటుంది] పంతులుగారూ, ఇదివరలో ప్రీమియం మొత్తం నాలుగువందలని మాతో మీరు చెప్పినట్టు జ్ఞాపకం...

రావు

క్షమించాలి, నా మెదడు పనిచేయడంలేదు. తమ వ్యవహారం పిళ్లెగారితో ఏర్పాటు చేయించండి... నేను సెలవైతే...

ప్రభావతి

[పుస్తకంలో నుంచి వుత్తరంతీసి] అరరే!...

శ్రీవారు

ఏమది ?

రావు

[చిత్తరపోయి చూసి, కంగారుగా లేస్తాడు]

ప్రభావతి

ఏమీలేదు నా ఉత్తరం ఒకటి పొరపాటున ఈ పుస్తకములో వుండిపోయింది.

శ్రీవారు

[ఉత్తరాన్ని ఆమె చేతిలోనుంచి తీసుకొని] నీవు పొరబాటున వుంచవచ్చును. కాని మేం కావలననే తీసుకువొచ్చాం. పంతులుగారూ వ్యవహారం పూర్తిచేస్తున్నాం కూర్చోండి.

రా వు

నాకు తల తిరిగిపోతున్నాది... క్షమించాలి ప్రభువులు నా పొరబాటులు...

శ్రీ వా రు

[ఆజ్ఞాపిస్తూ] మీరు కూర్చోండి ... తప్పదు, వీల్లేదు. మీరు కదలడానికి...అంకమ్మా, రజాక్‌ని జాగ్రత్తని చెప్పు.

అ ం క మ్మ

బాబు[చేతులు పైకెత్తి సర్దుకుంటూ, బిగ్గరగా]రజాక్ ఫైల్మాన్

ర జా క్

[అవతలనుంచి] జీ హుజూర్ !

అ ం క మ్మ

రాజావారి అజ్ఞ, ఖబడ్దార్ !

ర జా క్

[అవతలనుంచి] పారాహుషార్, అచ్ఛా మహారాజ్,

రా వు

[[illegible]]

శ్రీ వా రు

మీ వ్యవహారం ఇదిగో పరిష్కారం చేసివేస్తున్నాం, దీనితో ఆ తలతిరుగుడు ఇకవుండదు.

రా వు

నను క్షమించి సెలవిప్పించాలి ప్రభువులు...

పి ళ్ళై

ముకిక్క-ప్పేనరావ్గూ, వాయ్ముడు, షటప్, రాజావారి ఆర్డర్ ? ఇంపాజిబుల్ నీవు పూడ్చేది...శుమ్మా ఇరు, [శ్రీవారితో] రాజావారూ; అంజినూరు. ఫైవ్ హండ్రెడ్స్ వుందిసార్ [నోట్లు ఈయబోతాడు]

శ్రీ వా రు

[అక్కడ వుంచమని సౌజ్ఞచేస్తూ] అలా వుంచండి. మేం డబ్బు ముట్టుకోం.

పి ళ్ళై

[శ్రీవారి యెదరను పెడుతూ] ఆమా, ఆమా, ఎనకు తెలుసును సార్; పెరియ రాజా యెల్లాం అట్లదా సార్!

శ్రీ వా రు

[ప్రభావతితో] ఈ ఉత్తరంలో మమ్మల్ని గురించికూడా వున్నది కనుక మేం ఆలోచించే తీసుకువొచ్చాం, ఆ తప్పుడు కూతలకు కారకులైనవారే దాని ఫలితం అనుభవిస్తారు...నీకు బాధకరంకానీయం; అందుకు అభ్యంతరం లేదుకదా ?

ప్ర భా వ తి

శ్రీవారి చిత్తం. ఎవరికర్మ వారు అనుభవించక తప్పు తుందా ప్రభువుల దృష్టిలో పడినతరువాత ? [మాఖ్యప్రాణరావుని కసిగా చూస్తూ] ఒకరిని నిర్బంధించి బాధించినప్పుడు లేనిజ్ఞానం, ఆస్థితిలో తాము పడినప్పుడైనా కలిగితేచాలు. శ్రీవారి చిత్తం, తమరు యెటు నిర్ణయించినా సరే.

శ్రీ వా రు

[ఉత్తరం అందిస్తూ] ఈ వుత్తరం చదువు?

**ప్రఫుల్ల**

బిగ్గరగా చదవమని సెలవా?

**శ్రీవారు**

ఆ, బిగ్గరగానే; పెళ్ళిగారూ, మీరుకూడా జాగ్రత్తగా వినండి.

**పెళ్ళి**

వో, వింటునుసార్, వింటును!

**శ్రీవారు**

అంకమ్మా, ఖబడ్దార్, రౌద్రం, నీవు ఆ పంతులు వెనకను నిలబడు.

**అంకమ్మ, రౌద్రం**

చిత్తంబాబు [రౌద్రం ముఖ్యప్రాణరావు వెనకను నిలబడతాడు]

**ప్రఫుల్ల**

[లేచి నిలబడి, జాగ్రత్తగా ఉత్తరం పరిశీలిస్తుంది. ప్రభావతి ముఖ్యప్రాణరావుని కసితీరా చూస్తుంది. రావు చేతులు బల్లమీదపెట్టి తల వాల్చివేస్తాడు. శ్రీవారు కోపంతో, మీసం వడివడిగా తిప్పుతూ వింటాడు. పెళ్ళి అర్థంకాక, తెలిసీ తెలియని మొహం పెడతాడు. ప్రఫుల్ల జాగ్రత్తగా చదువుతుంది.]

ప్రణయిని ప్రభావతికి :

ఆలింగనపురస్సరముగా భవదీయ ప్రణయదాసుడు విన్నవించు విశేషములు :

"విటులపాలిటి యమదూత వేశ్యమాత" అన్నట్టు మీయమ్మ నన్ను దేవిడీమన్నా చేసి, మూడు నెలలనుంచి ముప్పుతిప్పలు పెడుతూ నేను బాకీ పడిన మూడు వందలూ

ముడుపు చెల్లించనిదే మీా ముంగిలి వాకిలైనా తొక్కడానికి వీలులేదని 144 వ సెక్షను నాపైన ప్రయోగించిననాటినుంచీ, మన్మథుడు ఈ విరహిజనుణ్ణి పంచబాణాలతో వేయివిధాల వేటాడుతున్నప్పటికీ, నేను శక్తివంచన లేకుండా ధనార్జనకై కోటివిధాల పాటుపడుతున్నాను. చిట్టచివరకు నా అదృష్టంవల్ల ఒక బంగారు పిచ్చుక నాచేతిలో చిక్కినది. ఇక భయంలేదు.

మీాయమ్మ తగు నోటీసైనా ఈయకుండా "లేప్స్" చేయించిన మన ప్రేమపోలసీని మళ్ళీ నేను త్వరలోనే "రెన్యూ" చేయించి అమలులోకి తెచ్చుకోగలవాడను. మన ప్రేమకథ మళ్ళీ ప్రారంభంకాగలందులకు బాకీపడిన ప్రీమియం మూడు వందలూ బహుశా ఈ సాయంత్రమే మీా ముసలిదాని ముందర పారవేయగలను.

కాని ఇందులకు నీ సహాయంకూడా చాలా అవసరం, పైన చెప్పిన బంగారుపిచ్చుకను పిండి నాలుగువందలైనా లాగవలెనంటే కొన్ని చిక్కులు ఉన్నవి. ఈ బంగారు పిచ్చుక అంత చచ్చుఘటంకాదు. దీనిని పని జరిగేటట్టుగా పట్టడంలో నీవు తళుకుగా నాటకమాడవలసి యున్నది. అతి తెలివిగా ఒక ప్లేన్ వేశాను. ఈ ప్రీమియం మొత్తం మీాకు చెందెడిదే గాన, నీవు ఎలాగైనా మీాయమ్మను వొప్పించి తళుకైన వేషంతో తత్క్షణం రావలసింది. చాలా అవసరం. తప్పదు, తప్పదు, తప్పదు.

మీాయమ్మ ఇందుకు ఒప్పకపోతే, ఈ బంగారుపిచ్చుక కల్యాణపురం జమీాందారని నీవు చెప్పవచ్చును.

నీవు వెంటనే రావలెను. ఆడబోయే నాటకానికి మనం ముందుగా "రిహార్సల్స్" వేసుకోవలెను. తరువాత నాటకానికి నీవు నటివి, నేను సూత్రధారుణ్ణి. రా, రా, రా! వెంటనే రా !

ప్రేయసీ,

నీ ప్రణయదాసుడు, ముఖ్యప్రాణరావు.

[కూర్చుంటుంది]

శ్రీ వా రు

[కోపంతో లేచి నిలబడి] పిళ్ళైగారూ, విన్నారా... ... దీనికి తగిన శిక్ష...

పి ళ్ళై

[లేస్తూ] తెరింజిపోచ్ సార్. ఎనకు తెరింజిపోచ్చి, [ముఖ్యప్రాణరావు వైపు చూస్తూ, పళ్ళు గిట్టకరిచి] ఇందమాదిరి తొడపకట్టె వేబారం, చింపురుకట్టె వేబారం; కళిదె వేబారం, గాడిదె వేబారం...నాన్ సేస్తునుసార్ శిక్షై, రాజావారూ... [కోపంతో పెదవులు వొణుకుతూ నిలబడతాడు]

శ్రీ వా రు

పిళ్లైగారూ, మీరు ఆగండి. మాకు జరిగిన అవమానానికి మేం తగిన ప్రాయశ్చిత్తం చేయిస్తాం. మీరుకూర్చోండి.

పి ళ్ళై

[కోపంగా కుర్చీని తోసి కూర్చుంటాడు]

శ్రీ వా రు

పంతులూ...అంకమ్మా, రౌద్రం, సరిగా కూర్చోపెట్టండిరా ... [అంకమ్మ, రౌద్రం ముఖ్యప్రాణరావుని చెరొక భుజమూ పట్టి తలవొత్తి కూర్చోబెడతారు.]

### శ్రీ వా రు

పంతులూ, మేం మాటదాటం, ఇదిగో [నోట్లు తీసి] కట్టవలసిన ప్రీమియం...

### పి ళ్ళై

[తటాలున లేచి, చేయి అడ్డుపెడుతూ] వేండాసార్, అంద కళిదకు వేండాసార్...

### శ్రీ వా రు

పిళ్ళైగారూ కొంచం వుండండి. పంతులూ ఇదిగో ప్రీమియం డబ్బు; మేం ఇచ్చినమాట ప్రకారం ప్రీమియం చెల్లించ దలుచుకున్నాం. కాని నీ దరిద్రగొట్టుచేతికి ఈయదలుచుకోలేదు. నీవు వేసిన దౌర్భాగ్యపు యెత్తు మాచేత ప్రీమియం కట్టించి వీళ్ళకి అర్పించడానికే కనుక, ఆమొత్తం మేమే స్వయంగా వాళ్ళకి అందిస్తున్నాం [ప్రభావతి ప్రఫుల్లలకు నోట్లు చెరిసకం యిచ్చి]

చదువు సంధ్యలు సరిగ్గా అబ్బక, ఉద్యోగాలకి తగక తగలబెట్టడానికి తగినంత డబ్బులేదని, తప్పుడు పద్ధతులు అవలంభించి, నిక్షేపంవంటి భీమావ్యాపారానికి కళంకాన్ని కూర్చి, ప్రజలకు ఉపయుక్తమయ్యే భీమాసంస్థమీద అమాయికపు ప్రజలకు అసహ్యం కలిగేటట్టు ప్రవర్తిస్తూవున్న నీవంటి ఏజెంట్లకందరకీకూడా బుద్ధిరావటానికి మే మీపనిచేశాం ... దౌర్భాగ్యుడా, నీపాడు బ్రతుక్కి బంగారు పిచ్చుకేం, [మండిపడుతూ] లే! అక్కడ్నుంచి లే! ... దరిద్రగొట్టా, బంగారు పిచ్చుక బెడిసికొట్టింది. ఇక ఊరివెంబడిపడి ఊర పిచ్చుకల్ని వేటాడు.

లే...పో...అవతలకుపో [రావు వెళ్ళబోతాడు] ... అగకర్కడ, కదిలావంటే జాగ్రత్త...[పిళ్ళైతో] పిళ్ళైగారూ మాకు కోపం వొస్తూంది ... మీరు ఆ మనిషితో మాట్లాడవలసివుంటే, మాట్లాడి లోపలకు దయచేయండి. ఈ రాత్రి మీరు మాతోనే భోంచేయాలి;తప్పదు.మీరుమాకు స్నేహితులు...

పిళ్ళై

థేంక్స్, థేంక్స్; థేంక్స్‌సార్, రొంబా థేంక్స్!

శ్రీవారు

మేం వెళ్తాం [రెండడుగులు వేస్తాడు]

ప్రభావతి - ప్రఫుల్ల

[శ్రీవారిని అనుసరిస్తారు]

పిళ్ళై

[ఒక క్షణం తటపటాయించి, శ్రీవారి వద్దకు ఆత్రుతతో రెండడుగులు వేసి, ఆయన చేయిపట్టి ఆపుతూ] రాజావారూ, రాజావారూ, జ్మాల్ రిగ్వెస్ట్‌సార్, జ్మాల్‌రిగ్వెస్ట్ [ఆందోళన పడుతూ రహస్యంగా ఏదో చెపుతూ వుంటాడు]

రావు

[శ్రీవారిని పిళ్ళైని కనిపెట్టి, జేబులోనుంచి రెండునోట్లుతీసి ఇద్దరు నౌకర్లకూ చెరొక నోటూ రహస్యంగా ఇస్తాడు]

అంకమ్మ, రౌద్రం

[నోట్లు అందుకుని "వెరీ థేంక్స్"అన్నట్టు సౌంజ్ఞచేశారు]

శ్రీవారు

[ఇటు తిరగబడంగానే] అంకమ్మా రౌద్రం, ఇలారాండి!

అంకమ్మ, రౌద్రం

బాబు [దగ్గరకు వెళ్తారు]

శ్రీవారు

మీారిద్దరూ పిళ్ళైగారి పక్కనుండి వారికి కావలసిన సహాయం చేయండి...ఖబడ్దార్!

రౌద్రం, అంకమ్మ

చిత్తంబాబు [పిళ్ళైకు చెరొకపక్కా నిలబడతారు]

[శ్రీవారు, ప్రభావతి, ప్రఫుల్ల నవ్వుకుంటూ వెళ్ళిపోతారు]

పిళ్ళై

[రౌద్రం, అంకమ్మ పక్కలను నిలవడం చూసుకుని, కెంటరమ్మని వాళ్ళకు కనుసౌంజ్ఞచేసి, ముఖ్యప్రాణరావు యెదరకు వస్తూ మండి పడుతూ] సే స్త్రీవి వేబారం! నీమూతి వేబారం, తోడపకళు వేబారం, కళిద వేబారం...ఇడ్యట్, ఫూల్!

ఎన్నాతలి స్త్రీవి, పైత్తెకారి; ఇది ఇన్స్యూరెన్సా, నాడగమా...ఇది డ్రామావా, సాళ్ళు, స్పీక్ మేణ్! రాస్తును రిబోర్డ్ పెరియ రిబోర్డ్...

ముక్కిప్పేనరావూ, పూడిసిందే, నీ ఉద్దేగం, పూడిసిందే, కూమ్ రివర్‌లో మునిగి పూడిసిందే, సచ్చి పూడిసిందే..

[రావు నిట్టూర్చి లేస్తాడు. పిళ్ళై బెదిరి, కొంచెం వెనకకు తగ్గి రౌద్రం అంకమ్మలను చూస్తాడు]

రావు

[పిళ్ళై మీదకు తిరగబడి, కళ్ళెర్రజేస్తూ] నీ ద్రావిడ తంత్రంలో తాత్కాలికంగా తగులుకుపోయానా ఖదం తొక్క...

తున్నావ్, ఖబడ్దార్; బయటికిరా నీబడాయి కనుక్కొంటాను!...

[పిళ్ళె అంకమ్మనీ రౌద్రాన్ని హెచ్చరించబోతాడు. అంకమ్మా రౌద్రం పరధ్యాన్నంగా పక్కలకు చూస్తూ నిలబడతారు. పిళ్ళె వెల వెల బోయి వెనకకు తగ్గి రావు ముందుకు అడుగువేస్తే అడుగడుగునా ఒక్కొక్క కుర్చీని అడ్డుపెడుతూ తత్తరపడతాడు]

రా వు

నాకర్మంకాలి కాసిచోట దొరికిపోయి కిక్కురుమనలేక పోయాననా తెగయెగురుతున్నావ్? నిక్షేపంలా యెత్తిన వ్యాపారాన్ని నీతెలివితక్కువ వాగుడుతో నాశనంచేసి; ఇంకా గాడిద కూతలు కూస్తావ్!

పి ళ్ళె

వార్నింగ్ నంబరు వన్,

రా వు

నీవంటి దౌర్భాగ్యపు దద్దమ్మల్నీ, నీతీనియమములేక నీచంగా అమ్మకానికి హాజరయ్యే ఆ తుచ్ఛస్త్రీలనీనమ్మినందుకు నాదే బుద్ధితక్కువ!

పి ళ్ళె

వార్నింగ్ నంబరు టూ!

రా వు

నీవెంత, నీ తకాయింపెంత, నీపోలీఉద్యోగం యెంత, నేనూ నాఉద్యోగమూ కాదు. నీవూ నీఉద్యోగమూ, నీకంపెనీ కట్టకట్టుకుని ఆపాడు కూవంనదిలో మునగండి. సచ్చిపూడ వండి!

పిళ్ళె

వార్నింగ్ నంబర్ త్రీ!

రావు

మామని పట్టుకుని చేతా వాతా కాని బ్రతుకుదెరువు యేడవడానికి నీలాంటి నిర్భాగ్యుణ్ణికాను. దీనితాతలాంటి కంపెనీలో, నీతలమీద జేజెమ్మనౌకరీ సంపాదిస్తాను. [కసితీరా చూసి వెళ్ళి పోతాడు]

పిళ్ళె

డిస్మిస్ [లోపలి గుమ్మంవేపు చూస్తాడు. ప్రభావతి, ప్రఫుల్ల ప్రవేశించడం గుర్తిస్తాడు. అంకమ్మ రౌద్రాలను చూస్తాడు. వాళ్లు 'కాన్సీ' అని పోజు చేస్తారు, ముఖ్యప్రాణరావు నిష్క్రమించిన గుమ్మంవద్దకు దూకుడుగా రెండడుగులు వేస్తూ, గూడకట్టు ఎత్తికడుతూ, పెద్దగొంతుకతో పౌరుషంగా] ఇడ్యట్, ఫూల్, తోడపకట్టై, చీంకిలికట్టై; గెటౌట్, గెటౌట్, మేన్ గెటౌట్ [తరిమివేసినట్టు నటించి. ఇటుతిరిగి] కళిదె, పైత్తెకారి...

ప్రభావతి, ప్రఫుల్ల

[గుమ్మంవద్దనిలిచి, పకాపక విరగబడి నవ్వుతూ] పిళ్ళెగారూ!

పిళ్ళె

[వాళ్ళనిచూసి] పెరబావదీ! [తానూ పకాపక నవ్వుకుంటాడు]

తెర తొందర